ఓమ్

శ్రీ రంగావధూతలవారి

# జ్ఞానబోధావళి.



గుంటూరునందలి

భక్తజన సమాజ కార్యదర్శియగు

ఆత్మూరి రామమోహనరాయ్‌చే ప్రకటింపబడియె.



చంద్రికాముద్రాక్షరశాల, గుంటూరు.

1915

వెల 0-4-0]    [వెల నాల్గణాలు.

బోవుటయు గూడ మానుట దటస్థింపుచు వచ్చెను. ఉపాధ్యాయునకు జీతమీయుమని తల్లిదండ్రులు దనచేతికిచ్చిన సొమ్మును దారిబోవునప్పుడు బీదలగపడినతోడనే దయారసహృదయుండై వారికొసంగుచును, వస్త్రహీను లగుపడిరేని కొంచెమైనను సంశయింపక తనపైనుండు వస్త్రముల నిచ్చుచును, నాదరింపుచుగడుసంతోషముతో నింటికిపోవుచుండువాడు. ఒకనాడు తలిదండ్రులు గొన్నిఫలముల దెమ్మని యంగడికి బంపగా నచట కొందఱు బీదలగుపడినతోడనే తనచేతనున్న డబ్బును వారికిచ్చి రిక్తహస్తములతో నింటికి దిరిగివచ్చి తండ్రియెదుట నిలువ దండ్రిచూచి పండ్లు కొనితెచ్చితివా యని తన్న నడిగిన "తండ్రీ! మీకు క్షణకాలము సుఖమును గలిగించు పండ్లను గొనక శాశ్వతసుఖమునిచ్చు పండ్లను గొంటి" నని తా నొనరించిన కార్యమును నివేదించెను. ఇట్లు దన చేతకొలది దానధర్మంబులు జేయుచు నెందైన హరికథలు, భజనలు జరుగుచున్నగాని, లేక యెవ్వరయిన భక్తులు వచ్చినగాని యచ్చటచ్చట కేగుచు సర్వ కాలములయందును, భగవంతుని తనమనంబున ధ్యానించుచు, నైహిక తాపత్రయంబునందు దన మనస్సును జొరనీయక సదా పరచింత గలిగి వర్తించుచుండెను. పదునాలుగు పదియైదు సంవత్సరముల యీడువచ్చువరకు నానాటికి భక్తివృద్ధియై ప్రాపంచక సంబంధ బంధములకు దూరుడయి ప్రాపంచక విషయం

ములయొక్క యస్థిరత్వమును మనమున దలపోయుచు స్థిరమై నట్టియు, నద్వితీయ మయినట్టియు, యా బ్రహ్మానంద మెట్లు లభించునాయని పరితపించుచుండు సమయమున బందరు కోటలోగల "చందమ్మ" యను నొక మహాపతివ్రతా శిరోమణిని గాంచి యామెవలన గొన్ని రహస్యంబులు గ్రహించి యామెను దనకు గురువుగా భావించుకొనెను. ఆ పతివ్రతా శిరోమణి యీబాలుని గాంచిన తోడనే యతని సుగుణములును, శాంతంబె మూర్తీభవించినదో యన నొప్పారు విగ్రహంబును, భగవద్భక్తియును, జూచి యీయన మహానుభావుండని యెంచి వారికి శిష్యురాలుగా నుండెను. జననీ పుత్రులవలె నొకరి కొకరు సహాయులుగా గొంతకాలమునుండిన పిదప యాచందమ్మ సమాధినొందెను. తదనంతర మీయవధూతగా రింటనుండుట తగ్గించి యడవులయందును, సముద్రతీరమందును నేకాంతమున సంచరింపుచు, నెండకును వానకును చలికిని జంకక, యాకలి, దప్పి మొదలగువానిని లక్ష్యముసేయక నిద్రయనుమాటయే మరచి రాత్రియనియు బగలనియు విచక్షణలేక యహోరాత్రములేకాగ్రచిత్తులయి తపస్సుగావింపసాగెను. అక్కడ నెవ్వరయిన దటస్థించి మాటలాడించిన మొదల గొన్ని సమయముల బ్రాపంచకవిషయమగ్నత లేమిచే మాటలాడకుండుటయు, గొన్ని సమయములయందు బ్రహ్మానందానుభూతుడయి తన

లోదాను నవ్వుకొనుచుండుటయు, జూచి మూఢత్వముచే వీనికి బిచ్చిపట్టినదాయని తలచుచుండిరి. ఇట్లుండ తండ్రి యాతనికి పెండ్లిచేసినగాని పిచ్చికుదురదనియెంచి తత్ప్రియత్నములు గావించెను, గాని యాతపసి తగు సమాధానములతో సంసార పాశముల దవ్వులకు తప్పించుకొనియెను. కొన్ని సంవత్సరము లీ రీతిగా తపోనిష్ఠాగరిష్ఠుడయియున్న పిమ్మట దన మనోరథమీడేరి భవబంధ విముక్తుండై బ్రహ్మానంద పదవిని బొంది యామహానందమును, నజ్ఞానాంధకారమున మునిగి దరిగానక తల్లడిల్లు మానవులను జూచి మిక్కిలి జాలిపడి వారల దరిజేర్చు కుతూహలము గలిగి కేయింబవళ్ళు పద్యములతోడను, గీర్తనలతోడను, వచనములతోడను, కథలచేతను, ఉపమానములచేతను, సామెతలచేతను అనర్గళ వాగ్ధోరణీ ప్రవాహంబుచే బోధింపుచుండెడివారు. ఆహా! యామాటల మాధుర్యము, వాని యర్థగాంభీర్యము, ఆకవితానైపుణ్యము, ఆకంఠస్వరము, ఆబోధాప్రజ్ఞయు, వినిన ప్రతిమానవుడును, నిశ్చేష్టితుడయి బొమ్మవలె గదలక యాచదువురానివానినోట సకల శాస్త్రసారమును మృదుమధుర వాక్యములతో వచ్చుటనుజూచి యుచ్చెరువునొందువారు కొందఱును, వారి యాకర్షణ దగిలినమాత్రమున నే ప్రపంచము మరచి భగవధ్యానమునందు మగ్నులయినవారు కొందఱును, ఆనందమున గంతులువేయువారు కొం

చుచుండు, నిట్లు పలుతెరంగుల చిద్విలాసముగా గుమిగూడి యుందురు. కొందఱు వీరి మనోధైర్యమును, భక్తినిశ్చలతను, యింద్రియ నిగ్రహమును, తపోమహిమను గనుగొనసమకట్టి పలుదెరంగుల పరిశీలించియు దరిగానక విఫలమనోరథులై శ్రీవారి నిశ్చలవైరాగ్యమును గొనియాడి యీతండు సామాన్యపురుషుండు గాడనియు కేవల భగవత్స్వరూపుడనియు శుశ్రూషలు జరుపుచుండెడి వారు. ఇట్లు కొంతకాలము కాలక్షేపణ జరిపి తదుపరి శ్రీవారు శిష్యవర్గముతో "ఇక ఆరుమాసములకు నిజస్థితికి జనుచున్నాను" మీరు మేలుకొనుడి! మేలుకొనుడీ యని ముందుగనే తెలిపిరి. తదుపరి నింక పదియేను దినంబులలో దేహము విడుచుచున్నానని చెప్పి శ్రీవారు పరమాత్మయందు బ్రహ్మైక్యము బొందువరకుబోధలు సల్పుచు, ప్రియ శిష్యులు దన వియోగంబునకై తల్లడిల్ల నేను లేననిమీరు భయపడకుడు. నేనునుడివిన ప్రకారము నడచిన ప్రతివానికిని దర్శనము నొసంగి సంశయములు దీర్చి కడతేర్చెదనని ధైర్య మువదేశించి 1905 సం॥ ది 1 డిశంబరు తేదీన బ్రహ్మైక్యమును బొందిరి.

ఈ మహానుభావుడు లోకహితార్థమై సమాధి నిష్ఠను జాలించి యప్పుడప్పుడుపదేశించిన వాక్యములును, పద్యములును, కీర్తనలును, వ్రాయుటకు వీలు పడనంతటియునర్గళధా

రాయుతమైయుంచుటచే, అవివేనవేలు యున్నను, నధికప్రయాసచే యీకొంచెము కీర్తనలను, పద్యములను, కథలను, మాత్రము అక్కడక్కడ శిష్యులు వ్రాసుకొనినవి నొక్కచోట జేర్చియీరూపకంబుగ నిప్పటికి నింతమాత్రము జనోపకారము కొరకు ప్రచురించుట కలిగినది. ఇందే దప్పులున్నను వ్రాసుకొనిన వారి పొరబాటులే గాని శ్రీరంగావధూతలవారి నోట నుండియొకప్పుడును పొరబాటురానేరదు. గనుక తప్పులను మన్నించి, ఒప్పులను మాత్రము గ్రహింతురని మాజదువరులను ప్రార్థింపుచున్నాడను.

ఇట్లు

ఆత్మూరి రామమోహనరాయ్,

గుంటూరు.





ఓం

# శ్రీరంగావధూతలవారి

## అనుభవజ్ఞానకీర్తనలు

1. రాగం, జంఝూటి—ఆదితాళం.

రారా సద్గురుదేవా। వేవేగమె॥

1. రారా సద్గురుదేవా। యేర మహానుభావా
నేరమెంచక బ్రోవ। వేవేగమె॥రారా॥

2. యుక్తా యుక్తము। లెరుగనివాడను
భక్తార్చిత గావ। వేవేగమె॥రారా॥

3. కనగ్రుడ్డి విన చెవుడు। కనలేను వినలేను
మనవి చేకొనవేర। వేవేగమె॥రారా॥

4. రాగ రహితదివ్య। భోగమహిమ జూపి
బాగుగ నేలరారా। వేవేగమె॥రారా॥

5. ఇంచుకైనను మొరా। లించవు దీనుల
చంచలతను బాప। వేవేగమె॥రారా॥

6. ధర రంగదాసాఖ్యుండు। మఱిమఱి మొరలిడ
అఱమర దేలార। వేవేగమె॥రారా॥

## 2. రాగం, హిందూస్థాని కాఫీ-ఆదితాళం.

1. నయనారె చందమ్మ । నయముద్దులమ్మా
భయమోహముల నిల । బాసియుంటివిగా ॥నయ॥

2. ఎందూన నలసట । జెందవీవమ్మ
సందేహ శూన్యము । నొందియున్నావే ॥నయ॥

3. నాదుబిందుకళా । తీతమైనావె
ఆదరించెడిగురు । పాదువు నీవె ॥నయ॥

4. గుణరహితమైన । ఘనురాలవమ్మా
అనుమానములుమిమ్ము । నంటవుసుమ్మా ॥నయ॥

5. మోదఖేదములేని । సాధురాలవే
వాదభేదము మాని । వసియించినావే ॥నయ॥

6. వాసిగ ధరరంగ । దాసుడనమ్మా
మోసమేమిక నన్ను । పోషించుమమ్మా ॥నయ॥



## 3. రాగం, ఫీలు—ఆదితాళం.

1. సుందరచిన్నది । బందరునున్నది । అందరికందదు
వినరా ♦ పొందుగ పెద్దవీధి । నందున వెలసియా ।
నందముతోనుండేనురా ॥సుంద॥

2. ఫలాఫలములకు । మూలదేవియై । కలకాలమునుందు
నురా ♦ లీలగాను జగ । మేలువాణి మా । పాల దేవిగ
నుండెనురా ॥సుంద॥

3. మీసముదిద్దెడి । రోషగాండ్లనెల్ల । మోసపుచ్చెనన్న
దిరా ♦ దాసజనుల ని । మేషమైన యెడ । బాసి
యుండ నన్నదిరా ॥సుంద॥

4. రవ్వలమేలిమి । మువ్వలహారము । రవ్వజేయుచుండె
నురా ♦ నవ్వునాపలే । మెవ్వరమైనను । వహ్వాయేమి
జెప్పుదురా ॥సుంద॥

5. అఱుమరేలర । మొరాలించె స । ద్గురుదేవియైయుండె
నురా ♦ దురితాత్ములను । దరిజేర్చకను । ఘోరనరక
మొసగునురా ॥సుంద॥

6. ఖ్యాతిగ రంగావ । ధూత సుతునిపై । ప్రీతిజూపుచుం
డెనురా ♦ మాతామహేశ్వరి । జ్యోతిస్వరూపిణి । నీతి
దెల్పుచుండెనురా ॥సుంద॥



4. రాగం, నాదనామక్రియ—ఆదితాళం.

1. ఎందుబోదునే । ఆనందరూపిణి, నే । నెందుబోదునే
ఎందుబోదునా । యందుప్రేమలే । దిందుముఖచం
దమ్మ జననీ ॥ఎందు॥

2. నమ్మినాడనే, ఓ । యమ్మాచేకొమ్మా । నెరనమ్మినా
డనే ♦ నమ్మినాడనో । యమ్మనన్నుచే । కొమ్మవర
ముల । నిమ్మువేగమె ॥ఎందు॥

3. నందనుండ నే ధర । ఖందరుపురనివాసి । నందనుండ

నే ♦ నందనుండయే । నందుజూపెదవా । వందనంబు
భవబంధవిమోచని ॥ఎందు॥

4. ఆదరించవే నీ । పాదసేవకుడ న । న్నాదరించవే ♦
ఆదరించు నీ । పాదసేవకుడ । మోదముతోడను ।
వేదపురాణి ॥ఎందు॥

5. దాసునైతినే । భాసురంబుగ రంగ । దాసు నైతినే
♦దాసునైతినను । కాచిబ్రోవుమ । దోసిలొగ్గితిని ।
మోసమేమికను॥ ఎందు॥



5. రాగం, యదుకుల కాంభోజి—ఆదితాళం.

జనులారా జనులారా।మా। జనని చందమ్మను। గనిరా
మీరెంచకైన॥జను॥

1. తెల్లనిచీరెగట్టి । నల్లని రవిక దొడగి
చల్లని కృపవెద । జల్లెడి మాతల్లి॥జను॥

2. ఒంటి కాసు నల్ల పూసల్ । కంఠమున తాలిబొట్టు
జంట బాయక భక్తుల । నంటి బ్రోచెడి తల్లి॥ జను॥

3. నిగ నిగ లాడెడు । నీలవర్ణపుఛాయ
అగణితముగ । సుగుణము లొందిన తల్లి॥ జను॥

4. కాళ్ళకు కడియాలు । వ్రేళ్ళకు వెండి మట్టెల్
నీళ్ళభావియొద్దెన । నిలచుండు కెరుగదు ॥జను॥

5. దాసురంగయ్యసుతుని । బాసి యీభువిలోన
ఆశలెల్లనుగోసి । వాసికెక్కిన తల్లి ॥జన॥

---

## 6. కీర్తన, ఆదితాళము.

1. వట్టిది బొమ్మలాటా । నేనేమనిజెప్పుదు జూటా । మా
టలచే నొక వేషముదాల్చక । చోటుగానక పూటలు
గడుపును ॥వట్టిది॥

2. నాదనుభావము । నమ్మదిరుగుచును । బోధను మెఱు
గక । వాదములాడెటి ॥వట్టిది॥

3. కాయము స్థిరము । కాదని యెఱుగక । కామక్రోధమున
కానక తిరిగెడి ॥వట్టిది॥

4. చర్మనరములు । యెముకలు చీము । రక్తముతోడవి
రక్తిగనుండెడి ॥వట్టిది॥

5. సారహీనసం । సారమునందు । కోరికచేత వి । చార
మునొందెడి ॥ వట్టిది॥

6. దండిగ తలారి । రంగదాసునని । రెండేదినములు యుం
డిపోయెడి ॥వట్టిది॥

---

7. రాగం, ఫీలు—ఆదితాళం. (డోరామాదిరి)

1. ఏమి సేతు కొఱగాని జన్మమతి । బాము చూపు తుందమ్మా ♦ పామరుండ చెడు నోమునోచితిని । కోమ లాంగి చందమ్మా॥ఏమి॥

2. స్వల్పవృత్తి సంకల్పముచే భువి । నల్పుడనయితినో యమ్మా ♦ చిల్పి చేష్ట యీవల్పుదీరమది । నిల్పలేను చందమ్మా॥ఏమి॥

3. సారవిహీనుని జేరదీసి నెడ । భారము నెంచకోయమ్మా వేఱు దిక్కు యుపకారమొసగలే । దాదరించుచంద మ్మా॥ఏమి॥

4. వృక్షము విడచిన పక్షినైతి నా । కక్షయ మొసగు మోయమ్మా ♦ రక్షణ సేయవె తక్షణ మిలవల పక్షమేల చందమ్మా॥ఏమి॥

5. తుచ్ఛభోగముల స్వేచ్ఛ మేడనే । నచ్చమెరుగనో యమ్మా ♦ బిచ్చగాడనై వచ్చినాడ జయ । మిచ్చి బ్రోవు చందమ్మా॥ఏమి॥

6. ఈదలేను భవసాగరమునసీ । పాదసేవకుడనమ్మా క్రోధమేల కడు బీదవాని న । న్నాదరించు చందమ్మా॥ ఏమి॥

7. రంగదాసు సుతుడొంగి సేవలు । ప్పొంగుచు జేయునోయమ్మా ♦ అంగనరో పర సంగ తెరుంగక భంగపడితి చందమ్మా॥ఏమి॥

**8.** రాగం, ఫీలు-అదితాళం.

జీవాయిది వినుమా । సత్యమెవెఱ్ఱి । జీవాయిది గను
మా ♦ నమ్మరాదీ మాయ సుఖము । యిమ్మహిజూ
టాని దెలియవె॥జీవా॥

1. సారములేదాని ప్రకృతి । జేరనేమి లాభ మిలలో
దారి గానలేక వ్యర్థమై । యూరకె చెడిపోకుసుమ్మా॥
జీవా॥

2. ఎచ్చటో పరిపూర్ణ మున్నది । హెచ్చుగాగాంచె
దనని ♦ పిచ్చియాశల తోడ వెతల । జొచ్చిమోస
మొందకేభువి॥జీవా॥

3. అంతయు నీ వనెడి యునికి । యెంత దూరము తర
చిచూచిన ♦ వింతగానీలోనె గలదిక । భ్రాంతులను
యెడబాపి జూడుమ ॥జీవా॥

4. ఎప్పటికి ముప్పులేదని । ఒప్పుగా నీలోన నీవె
యిప్పుడే మేల్కాంచి జూడుము । తిప్పలను బడబో
కుభువిలో ॥జీవా॥

5. రాగములను గూడి తుచ్ఛ । భోగమనుభవించినెడల
వేగమే సదానంద । యోగివై యుండుట కల్గున॥
జీవా॥

6. తనయుడగు రంగావధూత । గుణము కుదిరెడి బోధ
జేసెను ♦ జనన మరణము లేనివైభవ । మనయమును
గనుగొనుము వెఱ్ఱి॥జీవా॥



9. రాగం, నాదనామక్రియ—ఆదితాళం.

1. అద్దికొంపేమానసాయిది అద్దికొంపేమానసా బుద్ధిగా శ్రీగురునిపదముల । వద్దనేజేరుండవే॥ అద్ది ॥

2. కంటికింపుగానునేను । యుంటిననుకొంటివా । యింటి నుండిలేవితేసరి । మంటిలోగలిపింతురే॥ అద్ది ॥

3. తొమ్మిదిద్వారాలుదీని । కారుగురుదొంగలే । దూర మునను న్నాడుదొర । గాడు వెళ్లి చెప్ప వే॥ అద్ది ॥

4. దినమునకుమూడుసారులు । రవాణసరుకులుజరుగునే। దిగుమతులు యెగుమతులచేతను । దిరుగుచుండుట గల్గునే॥ అద్ది ॥

5. నేడుజూడయుండెనునురు । నాడులేకపోయెను । మండ లంబునరాకపోకలు । రెండుగలిగియుండెను॥ అద్ది ॥

6. ఆలుమగలనెజోడుపాడు । గోలలుగనుండెనే । మూడు దాటవలయునిది । జోడుబాయకయుండెనే॥ అద్ది ॥

7. ఎప్పుడోయొకనాడుబోవుట । తప్పదుయెవ్వారికిన్ । తిప్ప లుబొందెదవుగాన । నిప్పుడేగనుమిమ్మహిన్॥ అద్ది ॥

8. అంతమాయయెకానిమరియిది । యంతయునుయేమిటే। వింతగాయిలలోనరంగ । దానవస్యుండయదే॥ అద్ది ॥

---

10. రాగం, ఫీలు- ఆదితాళం.

1. సురలుమెచ్చిన।సుందరా కారునిమందిరమున్నదిఒరేఒరే మందిరమునన్న । మద్గురునాయనకువందనమంటిరా ఒరేఒరే। సు

2. మాయలేనివు । పాయములోనదు । పాయముజూపెర ఒరేబరే । కాయమున్నఆ । దాయములెల్లను । కల్లని దెల్పినదారేబరే॥ సు ॥

3. కర్మరహితమగు । నిర్మలస్థానవు । మర్మముదెల్పినదారే ఒరే । దుర్మార్గత్వము । దూరవరచెడి । దారిజూపిన దారేబరే॥ సు ॥

4. సారమైనయుప । కారమునుకరు । వారజేసినాదారే ఒరే । జేరదీసినాభారమంచుపలు । మాయజెప్పినది ఒరేబరే॥ సు ॥

5. తానుగానిదేదియునులేదను । ధైర్యముజెప్పిన దారే ఒరే। మానుగానురంగావధూతకును । మర్మముదెల్పిన దారేబరే॥ సు ॥



## 11. ముఖారి- అట.

1. అదుగోరబయలు। అగపడుచున్నా। డతడేనిశ్చలుడు।గతి యని శ్రీగురుహితబోధలనువిని । నుతియించుచున్నట్టి మతిమంతులరజూతు॥ రదుగో ॥

2. వేషధారులుఆర్యులనెల్ల । దూషింతురెప్పుడు । కాసు కాసుకుపదేశములని వెర్రి । ఆశజెందుటగాని లేశము గనలేరు॥ అదుగో ॥

3. ననుగెల్వమనుచుఆవల । నాదుగురుడన్నాడనుచు । పని బూనినీవిట్లుపడుటెందుకీపాట్లు । తనుదానుగనవలెకను లుమూసినలేదు ॥ అదుగో ॥

4. యెన్ని మాటలాడుకున్నా ! అందేమి లేదంతా వట్టిదిసు
న్నా । పిన్న బుద్ధిచెయెరుగున్నా మందురుగాని। కన్న వా
రల్లైన్న డనబోరువినరో౽॥ అదుగో ॥

5. నాగురునిమించి వేరెవ్వరను టేమిమంచి ।వంచన జేయక
వసుధలో వారల । పంచగోరునట్లుమదినుంచవలెసుమ్మ॥
అదుగో ॥

6. అచలులమనినామములు బెట్టినసేమి । మచిలిబందరులో
నవసియించియున్నట్టి । అచల శ్రీ గురువులు అవధూత
లెరుగుదురు॥ అదుగో ॥

---

## 12.

1. పంచబాణనినుసాధించజ్ఞాన । మానా । పంచబాణా॥
యించుకైనభయముంచదాయెమది । నెంచిజూడ బ్రా
పంచమందుక్రియ॥ పంచ ॥

2. హాతముసేతునిను । హితగతినిరోతు । వెతలుదీరసమ్మ
తినెరింగితిని । పతితముడిగిసద్గతిని జేరెదను॥ పంచ ॥

3. పెరుగనేలచివరకు తరుగమేల । విరగదంతునందరివలె
గాచుర । పరుగులెత్తవలె అరగదీతునిక॥ పంచ ॥

4. హద్దుమీరకలహామొద్దుపోర । బుద్ధిలేనివారొద్దనుండ
తగు । పెద్దలుభువిపరిశుద్ధులెరుంగుము॥ పంచ ॥

5. పట్టినానుగోతిలోపెట్టెదాను । వట్టిమాటయనిమిట్టిపడి
నయడ । పొట్టచీల్చునికదిట్టమెరుంగుమ॥ పంచ ॥

6. దొంగవీవు, రంగుగలొంగినావు। భంగపరచినిన్ సంకర మందున । రంగదాసు నీపొంగడంచునిక॥ వంచ॥



13. రాగం, నాదనామక్రియ—ఆదితాళం.

1. పోదాము రావే జీవీ । మన । కాధారుడగు శ్రీగురు
పాదములదరికి ॥పోదా॥

2. ఈధరణిలో దరి । లేదని తెలుసుక
శోధన జేసి మోహా । బాధలెల్లను విడచి ॥పోదా॥

3. ఏమి లేదని నమ్మ । కామాదిగుణముల
బాముల బడనేల । తామసముల నడచి ॥పోదా॥

4. ముచ్చట నొందెదవు । మచ్చరములచేత
హెచ్చరికతోడ । నిచ్చట నిల్వబోవు ॥పోదా॥

5. అన్యగుణము నిన్ను । భిన్నము జేయుగాన
శూన్యము జేసి బహు । మాన్యపదవి నొంద ॥పోదా॥

6. మనవారు మన మనె । మమతలలోబడి
అనువైన తెరినివిడి । అన్యాయమొందనేల ॥పోదా॥

7. కలకాల మీకామా । దులకు దగుల్బడి
వెలువడలేక జన్మ । వేదనలనొందెదవు ॥పోదా॥

8. రాను యోనులనుండి । పోను దేహమువిడి
కానుమ యింకనైన । మానవజన్మమును ॥పోదా॥
వాసిగ తలారివారి । వంశమందున రంగ
దాసుని మాటలు । మోక్షపు బాటలు ॥పోదా॥



14 । రాగం, ఫీలు—ఆదితాళం. ॥ఓ రామాదిక)

1. గురుపాదంబులె । పరిపూర్ణంబని । గురితోనమ్మును
సుజ్ఞాని ♦ చిరకాలంబును । నరకమునొందును । పరి
పరివిధముల నజ్ఞాని ॥

2. అతీతమార్గం । బచలంబేయని । యాత్మ దలంచును
సుజ్ఞాని ♦ మతినిలుపక నీ । క్షితిమోహంబుల । హత
మైపోవును అజ్ఞాని ॥

3. కాలహరణమును । జేయక తా దు । ష్కాలిలో జేరదు
సుజ్ఞాని ♦ పాలుమాలి సంసార । జాలమున గోలలచే
జెడునజ్ఞాని॥

4. వాసిగ ధర రంగ । దాసుని భావము । పలుమరు
తరచును సుజ్ఞాని ♦ లేశమయినవి । చారణ సేయక
మోసముజెందును అజ్ఞాని॥



15 . రాగం, నాదనామక్రియ-ఆదితాళం.

వందనంబొనరింతు చేకొనుడీ । భువినందరికినే ॥వంద॥

1. వందనంబొనరింతు చేకొను । డెందరో మహానుభా
వులు ♦ రంధ్రవిడి అద్వైత బ్రహ్మ । నందమున దేలా
డుచుందురు ॥వంద॥

2. గాఢమై యతిగోప్యమై తగు । జాడగనుగొని రూఢివిడు

వక ♦ మూడుకాల్వలుదాటి నిశ్చల । వేడుకను గని
వెలయువారికి ॥వంద॥

3. మోదఖేదము లేని యార్యులు । భేదమెరుగని సాధు
మూర్తులు ♦ వేదవేద్యులైన వారి । పాదపద్మము
లాత్మదలచుచు ॥వంద॥

4. లింగమును దిగమ్రింగి నార్గురు । దొంగలను మృతి
నొందజేతురు ♦ సంగరహితము నెఱుగు పూర్ణుల ।
కొంగి సేవలుజేయువాడను ॥వంద॥

కుళ్లునంటని దివ్యపురుషులు । కల్లుద్రావిన పగిది నుం
దురు ♦ యెల్లరిని సమప్రియమున తమ । యుల్లమున
భావించువారికి ॥వంద॥

లోకాతీతు లధికనిత్యులు వి । వేకమున సర్వమును
మరతురు ♦ రాకపోకలు రెంటినణమును । యేకముగ
నుండేటివారికి ॥వంద॥

వాసిగా నేనైన బందరు । ప్రాతరామనపేటలోన ♦
భానురంబుగ వెలసి రంగ । దాసునై నేనెల్లవారికి ॥
వంద ॥



## 16. రాగం, ఫీలు—ఆదితాళం.

క్షణ భంగురంబగు । దేహామునమ్మిక । సంచరించుట
నీకు । సరియగునా ♦ ఘణఘణమను నిప్పు । లనుబెట్టి
మాడురె గనలేకయుంటివె । ఓమానసా ॥క్షణ॥

2. గురువాజ్ఞమీఱుచు । గుణము కుదురు లేక । కునక
బుద్ధిలోనుండ । సరియగునా ♦ మరణమునొందిన యర
నిమేషములోనే । పరులపాలగుదువె । ఓమానసా ॥క్షణ॥

3. గంగ తుంగభద్ర కాశి కావేరికి । ఘనమనిపోయిన
సరియగునా, మంగళపదవిని మదిలోనె గనవలెమాయ
నుదెలియవె । ఓమానసా ॥క్షణ॥

4. ఫష్టున యింగ్లీషు ప్యాసుజేసి సం । తుష్టిలోనుండిన
సరియగునా ♦ యిష్టముతో పరకష్టము సేయక । భ్రష్ట
య్యెపొయ్యేవు । ఓమానసా ॥క్షణ॥

5. కాసులు పట్టెడ నాను గోధుమపూసల్ । వేసుకతిరిగిన
సరియగునా ♦ భాసురముగ లౌక్యవేషములన్నియు
నాశనమని దెలియవే । మానసా ॥క్షణ॥

6. రంగు రంగుల్ గల అంగీలువేసుక । పొంగుచు దిరిగిన
సరియగునా ♦ రంగావధూతవై భంగములేని తె । అం
గునెఱుంగవె । ఓమానసా ॥క్షణ॥

## 17. రాగం, ఫీలు—అదితాళం.

1. దేవ మార్గముదెలసిన మహానుభావులు । జన్మమునకు
రారుగా । మరల పోరుగా ॥దేవ॥

2. సంశయముడిగిన సద్గురుబోధవిన్న । మీద మోక్షము
న్నదీ అగుపడుచున్నదీ ॥దేవ॥

3. కానరానిదానిగను వారి కను । మానములు దీరునూ ।
దారికి జేరునూ ॥దేవ॥

4. కామ క్రోధ లోభ మోహ మదాది గుణముల । కడ
కుజిమ్మిన గల్గునూ । కర్మము తొలగునూ ॥దేవ॥

5. సర్వము తానని దెలసిన పూర్ణ భావము । లోనగంతులు
వేతురు । నిజముచు జూతురు ॥దేవ॥

6. జాడ నెఱుగక జడలు బెంచిన । జన్మరహితంబగు నా । తిరు
గుట తగునా ॥దేవ॥

7. ధారుణిలో తలారి రంగ । దాసు దెల్పిన వాక్యముల్ ।
యిహాపర సౌఖ్యముల్ ॥దేవ॥



18. రాగం—ఫీలు---ఆదితాళం.

1. మూడుగుణములను । రూఢిగ విడచిన । వాడే పూర్ణు
డు దేవా ♦ పాడుభ్రాంతులను । కూడియున్న యీ
గాడిద యెరుగదు త్రోవ ॥మూడు॥

2. కుక్కపంది యేనుగులను మ్రింగిన । చిక్కురహిత
మో దేవా ♦ ఎక్కడ జూచిన నిక్కముగను తా । నొ
క్కడెగనబడు త్రోవ ॥మూడు॥

3. దేశకాల పాత్రల యందెన్నడు । ఆశయుంచడో దేవా

నాశనమగు యీ వేషములను భువి । రోసియున్న
యెడ త్రోవ॥మూాడు॥

4. బాగోగులని యెడి । రాగ ద్వేషముల । సేగినొంద
డో దేవా ♦ వేగసర్వపరి । త్యాగమందుగల । భోగ
మరసి నెడత్రోవ॥మూాడు॥

5. బాలోన్మత్తపిశాచరీతిగా । లీలనల్పునో దేవా ♦ పీల
హర్షమును । నేల గొట్టిభువి గూలబడని యెడత్రోవ॥
మూాడు॥

6. ముదముతోడ సద్గురు వరు కృపచే । గన్న భావమిది
దేవా ♦ పదిలముగా రంగావ ధూతకిల । భాగ్యమొ
సగె నీత్రోవ॥మూాడు॥



19. రాగం, ఫరజ్--ఆదితాళం.

దాతారె సద్గురు దెలియు, యిహపర॥దాతా॥

1. అంచుట దుర్లభ మందరికిని యది । యెంచుజూచిన
ను । సందు లేకున్న యది॥దాతా॥

2. ఘాతసేయు కిరాతుకు లతిశయ । రోతగ జూతురు
నీతివంతులను ॥దాతా॥

3. మనసులోనున్నది మనసె యెరుగునది । కనుమనియు
న్నది । కనబడకున్నది॥దాతా॥

4. వాసిగ భువిలో వరరంగయ్యకు । భాసురముగనదివ
శమై యున్నది॥దాతా॥



20. రాగం, నాదనామక్రియ---ఆదితాళం.

1. ఏమిజెప్పుదు యేమిజూపుదు । యెండమావై యున్నది
చెండివేయగ వలయు నెరుకను। నిండుబయలోకటున్నది

2. తానుతానుయేకమైన । తావుగానేయున్నది।
నేనునీవు లేని వలెనె । గానబడుచున్నది ॥ఏమి॥

3. ఆదిమధ్యాంతములులేక । అంతట తానున్నది
శోధజేసి జూచుకున్న । చోద్యమవుచునున్నది ॥ఏమి॥

4. జపతపములు కానిది యది । జాతిభేదములేనిది
చపలచిత్తులకెందునిజముగ । శక్యముగాకున్నది॥ఏమి॥

5. పుట్టుచావులేమిలేక । దిట్టముగ తానున్నది
గట్టుపల్లమేమిలేక । ఘనతగలిగియున్నది॥ఏమి॥

6. హరిహరాదులకైనగాని । అలవిగాని దయ్యది
ధరణిలోతలారిరంగ । దాసుకనుభవమైనది॥ ఏమి॥



21. రాగం, ఫరజ్—ఆదితాళం.

భయమెందుకే మానసా, మానస, మనసా, భయ
మెందుకే మానసా, సద్గురుడుండ॥భయ॥

1. భయము యెంచు । కభయము లొసగును ॥ నయము గాయా దయనుగోరి ♦ స్వయము గానీవుండికమని । ర్భయమునే జెందంగవలె॥ భయ॥

2. లేనియరుల పోయెననియను । మానము లేకుండజేసి ♦ దాసభావము దెల్పితనయభి । మానముమాన్పిన వెనుక॥భయ॥

3. కొంచమైన । చంచలమును । సుంచకుండ దీసి వేసి ♦ మంచిదైన యచలమును బో । ధించిజెప్పుచున్న వెనుక॥భయ।

4. సంశయముచే బడక దాని । వంశమును నాశనము జేసి ♦ హింసలెల్లను బాసి పరము । హంసనుగనుగొన్న వెనుక॥ భయ॥

5. యుక్తి చేకలిగాయ దేహ । సక్తిని విడనాడితుదకు ♦ రక్తిగా విశ్రాంతిగలయా । ముక్తిసతిబెండ్లాడు వెనుక॥ భయ॥

6. పట్టు విడుపు లేని బ్రహ్మ ।చట్టువలెగదల కనిశము ♦ బట్టబయలైయున్నదాని । గుట్టును గను గొన్న వెనుక॥ భయ॥

7. ఎందుజూడ నఖండ పూర్ణము । సందులేని స్వానుభవమని ♦ బంధ మోక్షము వీడి పరమా । నందమును గనుగొన్న వెనుక॥ భయ॥

8. భేదరాహిత్యంబు నొంది। బోధరూపకమైన దెఱిగి
◆ నాదు బిందుకళాతీత । వీధిని గనుగొన్న వెనుక॥
భయ॥

9. నామరూప క్రియయు సర్వ । మేమియును లేనట్టిస్థితి
గని ◆ బాములను దెగవైచి తృప్తిచె । కామమును
మరచిన వెనుక॥ భయ॥

10. ముఖ్యమైన పరిపూర్ణము । మక్కువతో జెప్ప నీకు
శక్యముగానట్టిదిర । సౌఖ్యము చూపిన వెనుక॥ భయ॥

11. సూటిగా నేరైన బందరు । కోటపెద్దవీథిలోన ◆వాట
ముగ రంగావధూతై పాటిగవిలసిల్లు వెనుక॥ భయ॥

---

22. రాగం, సారోజి—ఆదితాళం.

ఆహా మూనసా, మోహాపాశమున, మోసపోయెద వు
ఆహా ॥ దేహాశాస్త్ర కులాభిరతిప విడు॥ ఆహా

1. దిక్కు లెల్లగురుడొక్క రీతిగ । పిక్కటిల్లుచున్నాడే।
ఎక్కడ వెదకిన వాడే । తేక్కదెలసుకొని జూడె
చిక్కు దీరుభువి । కొక్క రాయివలె । ధిక్కరించకి
ది । చక్కనిభావము॥ ఆహా॥

2. పంచభూతము లైదుగూడి పాఁ । పంచమాయెనిది
వినుమా । మంచిచెడ్డ గనుగొనుమా । యొంచనేమి
లేదనును ◆ కొంచమైన యూ । హించిచూడవతి ।
చంచలంబు బా । ధించనేడ్చెదవు॥ ఆహా॥

3. ఊరుపేరులే నమితదుఃఖమును । చేరదలతువదియేల। దారితప్పినెడగోల । పూరక చెడెదవుమేల ♦ క్రూర మైనగతి దూరినెడల ని । ష్కారణంబుగ । నారడి నొందెదవ॥ వాహా॥

4. పాపపుణ్యముల పాశిపుగోరచి । ద్రూపమె సత్యము గాదు । తెరవేపునెరగినెడవాదు । పరితాపమొంద పనిలేదు ♦ రేపుమాపు స్వపోప్నపదేశముల । దాపు కేగయము । రూపమెరుంగుము॥ ఆహా॥

5. నిన్ను నీవుగనకున్న సంగతిని। యెన్నదలచవే మూఢ। వెన్నెల నెపగెడిజాడ। తిన్నగనుండవె మూఢ ♦ మెన్నొజన్మములు యున్నవందురిటు। కన్ను తెరచి గను। మన్నియు ఖాయును॥ ఆహా॥

6. కుక్కచందముగ నిక్కమెరింగియు । కక్కసనస్తువ కీవు । మక్కువ గొనుచున్నావు । చొక్కియుంట గనలేవు ♦ ప్రక్కనె యున్నవి పెక్కువలలునిను । గ్రక్కున పట్టుక ద్రొక్కిన విడువవు॥ ఆహా॥

7. ధరణిలోన రంగదాసు బోధలకు । తిరుగులేదనుచు నమ్ము । పరగుస దెలుసుకొమ్ము। తరుగని భాగ్యమును మ్మా ♦ పరబ్రహ్మ వేత్తలయినవారల। మరుగుజేరి యతి ముదిపమెరుంగుము॥ ఆహా



23. రాగం, నాదనామక్రియ—ఆదితాళం.

జగముండేదనృతమెరు, కొండమాపురా। యొగుకొండమాపురా.

1. భాసెడి స్వప్నముకు । కాశపడినయెడ । లేశమైనను శుద్ధభాసమున్నదే॥ జగ॥

2. జ్ఞానమజ్ఞానము । లేనియచలమున । మానాభిమాన ములు । మేనువిడువరా॥ జగ॥

3. ద్వంద్వరహిత యూ । నందము నెఱిగిన । యెందుఁజూచి నబయ । లందేయుండురా॥ జగ॥

4. నిశ్చయముగనిది । హెచ్చరికగునది । గచ్చపొదను జూచి। జొచ్చ శ్రీయమా॥ జగ॥

5. భావాతీతమైన । శ్రీవనుగను నెడ । నీవేసర్వమన్య మేమియు లేదురా॥ జగ॥

6. భాండజలముల యం । దుండు భాస్కరురీతి । నుండేటి భ్రాంతులను । చెండివేయురా॥ జగ॥

7. ధరణి బందరుకోట। పురి పెద్దవీధిలో।వరసత్య చందమ్మో। అరయబ్రిహ్మరా॥ జగ॥



24, రాగం, సారోజి-ఆదితాళం.

ఆనందసాగరమునదే । లానుదాముఠండీ

తానందేతానైన । తాతక్కఅన్యంబె॥ ఆనం॥

1. ద్వయదోష గుణరహి । తద్వయితమండీ ।
భయమెందు బడరందు । భాగందుబరిసందు॥ ఆనం॥

2. భావాభావముల రెంటి । కావలుందండీ
భావమొ యభావమొ। భావాభావములు లేవు॥ ఆనం॥

3. అందిందు నెందైన । యుందిచూడండీ
అందిందునిందందు । సందెందు లేదందు॥ ఆనం॥

4. వాసిగరంగావధూత । జేసినబోధ లెల్ల
నాశరహితమహో । ల్లాసమనుచువిని॥ ఆనం॥

---

25. రాగం, ఫీలు-ఆదితాళం.

1. వాదమాడే సాధులారా । వాదమాడకండీ ।
మీ పాద సేవకుడగురు। బోధవినుడీ॥ వాద॥

2. ఆకాశంబే బయలందురు । ఆకాశముగాదండీ,
ఆకాశమున జడత్వమున్న ది।అగుపడుచున్న దండీ॥ వాద॥

3. మిథ్యాప్రపంచకమనిరి । బ్రహ్మసత్యమా
అధ్యారో పాపవాదము । మిథ్యకున్న దా॥ వాద॥

4. విపరీతమెగురు కృపగోరితిమని । నెపము లెన్న కండీ,
చపల ముడుగని యుపదేశంబులు। చెడిపోవుటకండీ॥
వాద॥

5. ధరణిలోన రంగావధూత । మొరలువినండీ।
పరమభక్తవరులజేరి । తెరవుగానండీ॥ వాద॥

26. రాగం, నాదనామక్రియ-ఆదితాళం.

ఏమిలేనిదనెరుగ లేరయ్యా । పామరులతీరు॥ మేమి॥

1. యేమిలేనిదనెరుగలేరు । తామసాత్ములైనవారు ◆
పామరత్వము వీడిసద్గురు । స్వామిబోధ ప్రేమతోవిని॥
ఏమి॥

2. ఉండిలేనట్లుండి నిఖిలము । నుండద్వితీయము నుండ
గాంచి ◆ ఖండఖండమైన యట్టియ । ఖండపదవి
రెండుగానిది॥ఏమి॥

3. కాగడాను చేతబూని । వేగచీకటి రమ్మనుచు◆
బాగుగా బిలచినగాని । సాగివచ్చునె త్యాగమొంది॥
ఏమి॥

4. గొడ్డలిచే నడవినంత । గొట్టిపారవై చువెనుక।
చెడ్డవైన మృగములుండ । అడ్డులేక యొడ్డునబడు॥
ఏమి॥

5. మాయమాయమాయయనుచునె । బాయక సంసార
మందు ◆ హేయమైన మడ్డిలోబడి । హాయిగానుండు
టనుమరచి॥ ఏమి॥

6. వెన్నయందే కాచనేయి । యున్నరీతి తన్నుదాను ◆
గన్నయెడల గమ్యపదవి । యున్నదితానున్నచోట॥
ఏమి॥

7. చూడగలడే గుడ్డిమనుజు । డేడనయిన నద్దమందు ।
రూఢిగా తనసుందరతను । వేడుకతోగూడుకొని॥ఏమి॥

8. వాసిగ తలారివారి । వంశమందున రంగదాసు ॥ సంశయంబును లేని నిశ్చల । హంశ మెరుగ జేయుచుం డగ॥ఏమి॥

27. రాగం, నాదనామక్రియ—ఆదితాళం.

అందదు గదా, నిజమేదో । ఆదరికిని యనుభవ మున। కందదు గదా, నిజమేదో॥

1. అచలమార్గమని । యార్యులు నుడువగ । ఆదున కొందరు గురూపదేశం । బొందుచు యాగురు శిష్యు లిరువురు । అచలురమనుకొని । యానందించిన॥అంద॥

2. పరిపూర్ణంబట । యెరుక లేనిదట । యెరిగించెడి స । ద్గురుడు కలండట ॥ యెరుక లేని యా పరిపూర్ణంబు ను । యెరిగించెదమని । యెట్లనెదరో భువి॥ అంద॥

3. నేను నీవు యనె భావము యెరుకని । యెంచిరిగద ప్రాపంచము లేదని ॥ నేను నీవు లేనిదె గురుశిష్యుల నియమమేదయా నేమియు లేనిది॥ అంద॥

4. బయలు బయలనుచు బల్కగ నేటికి । భయరహిత మైనదే నిర్భయలది ॥ నయముగ యాబయలే బ్రహ్మం బని । నమ్మినగోప్యము నంతటనున్నది॥ అంద॥

5. తన్ను దెల్పువాడే సద్గురుడని । పిన్నలు పెద్దలు నెన్ను చునుండిరి ॥ తనుదా నెరిగినతానే లేడే । యున్న దెచ ట యా యుపదేశంబులు॥ అంద॥

6. రెండుమూడు నాల్గణాలుబెట్టిన । దండిగ్రంధములు వచ్చుచువాటిని ♦ నిండమక్కువను చేతబూని య । ఖండులమని తా మెగురుచు దిరిగిన॥ అంద॥

7. విగ్రహావృష్టినై వేద్యనష్టియని । అగ్రగణ్యు లార్యులన్నరీతిగ ♦ ప్రజ్ఞజెప్పెదరు సుజ్ఞానులమని । శ్రీఘ్రముగను సత్యోగ్రత జెందుచు॥ అంద॥

8. కాలుజూడ గడపదాటకుండిన । మాటలు కోటలు దాటినపగిదిగ ♦ చాలగ నచలము కీలకమెరిగిన । శీలుము లేడని దూలనాడినను॥ అంద॥

9. జన్మంబెత్తిన అన్వయమవనిలో । తన్మయ తారతమ్యము గనుగొని ♦ నిర్మలాత్మలో నిలచి యుండుటకు । కర్మసూత్రమే కారణమందురు॥ అంద॥

10. ఉన్నస్థితులను తిన్నగనందరు । యెచ్చుడి యెరుకను అన్నలారయిల ♦ దున్నయీనెనన దూడనుగట్టుడి । యన్నచందముగ నున్నదిచూడగ॥ అంద॥

11. పదియిరువది రూకలు వశపరచెడి। అధికధనముగల అప్పులైనమెడ ♦ మదమున యెరుకను మనువిడిపింతురు । పిదపఫూర్ణమును ప్రియమునజూపిన॥ అంద॥

12. గుణరహితమె బహుగుహ్యంబైనది । జననమరణములు జెందని జాగ్రత ♦ తనలోతానై తరచిజూడవలె । అనుమానముచే నటునిటుబోయిన॥ అంద॥

13. ధరణిలో సద్గురు సత్యవాణి చం । దమ్మున్మరణనిరత మును జేయుచును • పరగతలారి రంగదాసునని కీర్త న బాడిన కీర్తి కొరకెగా॥ అంద॥



28. రాగం, సాదనామక్రియ—ఆదితాళం.

ఆనందమే మానసా బ్ర । హ్మానందమేమానసా॥

1. ఎంతతరచినను । అంతము దొరకదు । సంతకూట మిది చెంతనె యున్నది । వింతగ గురుశిష్యాంతరంగ మున । అంతయు శూన్యము । భ్రాంతియె మూల ము॥ ఆనం॥

2. అనవినరానిది । మనముననున్నది । గనువెడవారికెఘున మగు, నన్యులు । పనిబడితనకడ పాదములొత్తిన। మనవిని జూపెద మనుటది ధర్మమే॥ ఆనం॥

3. వట్టిది సర్వము । వట్టిదనుటయును । వట్టిది, భావము వట్టిది వట్టిది । యిట్టిదట్టిదన దిట్టపడదు క్రియ । వట్టి దొ, ఘట్టిదొ యెట్టిదొ తెలియదు॥ ఆనం॥

4. కొద్ది గొప్పయనె । రద్ది లేదనుభవ । సిద్ధము దీనిని సిద్ధులుగను గొని । ముద్దుగ వృత్తిని వ్యర్థమనుచు విడి। వర్ధిల్లుదురట సార్థకమున బడి॥ ఆనం॥

5. ముదముతో శ్రీగురు । ముఖ్యశిష్యులకు । చెదరదె న్నటికి అదుగో పూర్ణము । పదిల మెరుగు మని నద

యిలుగను మను । |టదియును నెరుకే । హృదయము శూన్యము॥ ఆనం॥

6. మోదము గోడను సాధులు రూఢిగ । ఆదిని షోడశ మావల సత్యము । ద్వాదశ మంత్రము వేదన లేని ది । భేదరహితమనె । బోధయు మాయమె॥ ఆనం॥

7. గోచర మంతయు గోతిని బడు నది । గోచర మేదో యగోచర మెట్టిదో । యోచన పరులకు దోచును సర్వము । దోచియు దోచని జూచిగ నుందురు॥ ఆనం॥

8. పంచముద్ర యోగముల నన్నిటిని । మించిన గోప్య ముచంచల రహితము । కొంచ మైన కొఱయుంచ దు పూర్ణము । వంచన బడదది యెంచి చూచుటకు ॥ఆనం॥

9. రెప్పపాటులో చప్పున దేలును । తెప్ప చందమున చెప్పను వీలా । యెప్పుడు తనలో నొప్పగతానై । నిప్పును బోలిన నిర్మల యోగ్యత॥ ఆనం॥

10. తీరుగ జయమును గోరినవారై । ధారుణి వెతసంసారమునందే । దూరియుందురట, కోరిక లేకను । ధీరులకలవర మూరకెగొందురా॥ ఆనం॥

11. నీలివార్తకలకాలము మాయా । జాలమువృత్తి చెవాలలాడు నట । కీలెడబాయను వీలు లేదురా । మూలము గనుబడ దేలాగ్గనో॥ ఆనం॥

12. చిల్లరగతులను, నొల్లని వారల। కల్లరి శూన్యము యె ల్లెడ సతతము। తెల్లముగను గొని మెల్లన ప్రకృతి। కల్లిడి నిర్మల యుల్లము నెఱిగెద॥ ఆనం॥

13. రెండను మమతచే। యుండెగ యలసట। చెండినని త్యము పంకముగగలదని। దండి వారు దాస అండను జేరుక। పండు వెన్నెలటు నిండియుందురట॥ ఆనం॥

14. రంగదాస వర సంగతి నెఱిగిన। భంగము లేని తెరం గు నెరింగియు। మంగళ పదవిని। మది లోగన్గొని। సంగ రహితులై పొంగుచు నుందురు॥ ఆనం॥



29 రాగం, మారువ—ఆదితాళం.

డుమ, డుమ, డుమ, డుమ, డుమ, డుమ్మా। డుమ, డుమ, డుమ, డుమ, డుమ, డుమ్మా॥

1. పుట్టదు గిట్టదు డుమ డుమ్మా। కొట్టను తిట్టను డుమ డుమ్మా। గుట్టు తెలసితే డుమ డుమ్మా। బట్టబయ లయో, డుమ డుమ్మా॥ డుమ॥

2. భ్రాంతులు లేనిది డుమ డుమ్మా। బ్రహ్మంబను నది డుమ డుమ్మా। అంతట నున్నది డుమ డుమ్మా। అచ లంబే యో డుమ డుమ్మా॥ డుమ॥

3. రేపును మాపును డుమ డుమ్మా। రూపము లేనిది డుమ డుమ్మా। చూపుల కందదు డుమ డుమ్మా। నూది మోపనిది డుమ డుమ్మా॥ డుమ॥

4. వాసిగ శ్రీగురు డుమ డుమ్మా । వరసత్య చందమ్మ డుమ డుమ్మా । దాసు రంగయ్యకు డుమ డుమ్మా। ధైర్యమై యున్నది డుమ డుమ్మా॥ డుమ॥

# గురు శిష్య సంవాదము.

30. రాగం—ఫీలు—ఆదితాళం.

1. నూదిమోపసందులేని । నూటు దెల్పుమగురువరా ॥ సాటిలేనిది యచల మనియెడి । సంజ్ఞ దెలియర శిష్యుడా॥

2. సాటిలేని దనగ నెట్టిదో । తేటపరచుము గురువరా ॥ తేటపరచెద నీనిమనసున । నాటియుండర శిష్యుడా॥

3. నాటి యుండిన సందుగ లెడే । నధిక మేమిటి గురువరా॥ బూటకము నిక దాటి నామ । చోటు జూతువు శిష్యుడా॥

4. దాటి పోవను బూటకంబును । బాటయేదయ గురువరా ॥ వాటముగ నీ రాగ ద్వేషము। మీాటియుండర శిష్యుడా॥

5. రాగద్వేషము లున్న యెడ భువి । సేగియేమిటి గురువరా ॥ త్యాగమును గలిగింప నీయక । బాగుసేయవు శిష్యుడా॥

6. బాగునోగను రాగ ద్వేషము । బాగదేమిటి గురువ
రా • బాగునోగులు గాని పదవిని । బాగెయుంటిర
శిష్యుడా॥

7. జరయు మృతియును । జెంను జన్మమి చెందు చేతను
గురువరా • కర్మచేతను గల్గుచున్నది । కాగణంబిది
శిష్యుడా॥

8. కర్మరాకకు హేతువైన । మర్మమేమిటిగురువరా •
కర్మరాకకు జన్మహేతువు । జన్మరాకకు కర్మరా॥

9. జన్మకర్మల రాకమూలము । చెప్పుమయ్యాగురువరా•
జన్మకర్మల మూలమిదియని । జెప్పజాలనుశిష్యుడా॥

10. చెప్పజాలని హేతువేమొ । చెప్పుమయ్యాగురువరా•
తప్పలనుగల్పించుప్రశ్నర । మెప్పుగాదురశిష్యుడా॥

11. పంచముద్రల యోగములకే । పరమపదవటగురువరా.
మంచిగాగారాడివిద్యలె । యెంచిచూడగశిష్యుడా॥

12. మించినదియుంకొకటియున్నది।అమితము(శ్రీ)గురువరా•
మించినట్టు మంచినిబో । ధించెదాను శిష్యుడా॥

13. కన్నుమూసితె గానబడదీ । మిన్ను యేమిటిగురువరా•
యున్నదని భ్రమజెందుచున్న । యెరుకయిదియెర
శిష్యుడా॥

14. ఎవనిచే నిర్మింపబడ్డది । యెరుకబ్రహ్మము గురువరా•
యెవనిచే గాదెండమావుల । నీరువంటిదిశిష్యుడా॥

15. నేనునీవనె భేదమేర్పడె । నెందుచేతను గురువరా ॥ యెఱుకచే నేర్పడెను భేదము। యెఱిగి వినువర శిష్యుడా॥

16. నేను నేనని యహము జెందెడి। నేనెవండను గురువరా॥ నీవె బ్రహ్మము నీవెయంతయు। నిండియుంటివి శిష్యుడా॥

17. బ్రహ్మనేనని నమ్మదేహం। ద్రియములున్న విగురువరా॥ బ్రహ్మ నీవింద్రియములనుకొని । భ్రమలుగొంటివి శిష్యుడా॥

18. యెన్నడిది లేదనుచు దెలియను । యెరుగజేయుము గురువరా ॥ నిన్ను నీవు దెలిసికొనునెడ। నిలకడుండును శిష్యుడా॥

19. నన్ను దెలిపే సాధులీరని । నమ్మియుంటిని గురువరా॥ తిన్నగా వెలుగుచు బయలై । యున్నదదిగో చూడరా॥

20. ప్రియముతో మీదయను బడసి । నయముదెలిసితి గురువరా ॥ నయము దెలిపినందుకు నా । కేమియిత్తువు శిష్యుడా॥

21. అంతమీ కర్పించుటకు నే । నెంతవాడను గురువరా॥ అంతయనగా నేమిటినీ । తనువుదక్షిణయువ్వరా॥

22. తనువుదక్షిణయిచ్చితినిమీ।యనుమతిని శ్రీగురువరా॥ యిచ్చినట్టి తనవుపైన । యిచ్ఛగలిగిన ద్రోహిరా॥

23. వసుధలో చందమ్మమాతకు।అచలమందెనుగురువరా॥ మచిలిబందరులోన రంగ । దాసువశమిది శిష్యుడా॥



## మంగళహారతి.

కీర్తన— రాగం—నాదనామక్రియ—ఆదితాళం.

జయజయ హారతోయమ్మా-బిన్న-దయనేలు సత్యచందమ్మా

1. పీనమైనగాని ♦ వాసిని ♦ గనరాని।
దూషణ భూషణ ♦ రోసి యుండినతల్లి ॥జయ॥

2. పరాకుసేయక ♦ దురాభిమానము।
బిరానవిడికడ ♦ తేరిన మాతల్లి॥ జయ॥

3. కోపాతిశయముల ♦ నోపకసంసార।
కూపముపై భ్రాంతి ♦ నేపణచిన తల్లి॥ జయ॥

4. శ్రేయమని గురు శిష్య ♦ న్యాయమున నాట్యమాడి।
బాయక పరలోకసుఖమును♦మాయనుదాటిన తల్లి॥జ

5. సరిలేని ఆర్యస ♦ మాజములందున
విరివిని గనినతి ♦ మరుగునొందిన తల్లి ॥జయ॥

6. నదురు బెదురులేని ♦ కుదురును గనుగొని।
చెదరక ముదమును ♦ పదిలపరచినతల్లి! ॥జయ॥

7. ధరణి బందరు కోట ♦ పుర పెద్ద వీధిలో।
పరమాత్మ యనబడె ♦ బిరుదు నొందినతల్లి॥ ॥జయ॥





# శ్రీరంగావధూతలవారి

# జ్ఞానబోధ

## 1. నరకము, స్వర్గము, మోక్షములనుగూర్చి.

:(o):

లోకంబను పట్టణమున అవివేక మనెడి మహారాజు గారు కామ,క్రోధ, లోభ, మోహ, మద, మాత్సర్యములను ఆరుగురు బంట్లు కలవారుగా నుండిరి. ఈ పట్టణంబున నుండు ప్రతి వారును యీ పట్నాధిపతి విలాసము చొప్పున విహరింతురు. ఈ ఆరుగురు బంట్లలో యేబంటును విడిచినను తమ నటన క్రమముగా నెరవేర్చుకొన వీలు యినుమంతయిన నుండదు. కాబట్టి యెంతటివారుగా నుండినను యీ యారుగురి బంట్ల ననుసరించియే నడువ వలయును. లేనియెడ వీరి కాల మీ పట్నమందున్నంత వఱకు నికనేలాగునను గడువదు. ఈ పట్నమందుండువారిస్థితి, దీపమును జూచి ఫలమని భ్రమసి నందు పడిచచ్చెడి పురుగుల సగిదిగానుండును. ఈ పట్నమందుండు వారే అధములు.

(1) కామము:—అనగా ప్రపంచ మందు గల విషయము లప్రత్యక్ష గోచరంబున దోచు అనుభవము లను జూచి, అది ఇది, కావలెననెడిగుణము.

(2) క్రోధము:—అనగా కామగుణమున బయలు పఱచబడు విషయజాలంబున అనుభవమేమైన భిన్నంబు నొందుచుండినగాని, నొందిన గాని, అసమయంబున రేగు తామసగుణము.

(3) లోభము:—అనగా కామగుణమున ప్రేమింపబూను విషయములలో నెద్దియైన బోవునేమో యనెడి పిరికి గుణము.

(4) మోహము:—అనగా కామయునికియందు గల విషయములయందు అనుభవతేడాను గాంచి ఆహా అది బాగుగనున్నది ఇది బాగుగనున్నది యటంచు ఆశ్చర్యకరముగా వర్ణించు గుణము.

(5) మదము:—అనగా క్రిందుమీదు నెఱుగక అంధుని పగిది విచారణ మఱచి అందఱికన్న అధికుడనంచు విఱ్ఱవీగు గుణము.

(6) మాత్సర్యము:—అనగా నెదుట వారి గౌరవమును జూచి యోర్వలేక అనాదరణ సేయు గుణము.

ఇట్టిస్థితిగల యీ యాఱుగుణంబులు లోకంబనుపట్టు

ణంబున :బంట్లసి చెప్పంబడును. అవివేకమనగా అజ్ఞానము. ఇదియేనరకము.

లోకానుకూలంబను పట్టణంబు మఱియొకటి కలదు. వివేకమనెడి మహారాజు గారుండిరి. సత్యము, జ్ఞానము, ధర్మము, దయ, శాంతము, ఓర్పు, యను ఆరుగురు బంట్లుగలరు. పైనుదహరించిన రీతి గానే యీపట్నములోనున్న ప్రతివారును ఈపట్నాధికారి వీలును దోచు బంట్లలో ఏబంటు లేక పోయినను సరియగు సంచారము సమకూడదు. కాబట్టి యీ పట్నమందున్న వారు యెట్టిఘనులుగానుండినను యీ యూరు గురి సహాయము లేక కాలంబును గడుపుకొన వీలులేదు. ఈపట్నమందున్న వారి స్థితి దీపముకుజూచి పండని భ్రమసి అందు బడిచచ్చెడి పురుగుల చందము గాక, దీపమునంబడు నెడ చచ్చెదమనెడి యెరుకగలిగి, అలయా వెలుగున కానందించుచు సంచరించెడి పురుగులొందు ప్రాప్తికి ఆప్తులుగా నుందరు. ఈపట్నమందుండు వారే మధ్యములు

(1) సత్యము:—అనగా కలయందైనను అనృతమాడని గుణము.

(2) జ్ఞానము:--- అనగా నేను ఎచ్చటనుండి యిచ్చటి కివచ్చినాను. ఎందుకు వచ్చినాను. ఇచ్చటనుండి యెచ్చటికిపోయెదను. నేనెవరిని. ఇదియంతయు నేమిటి? అనెడి యీశుద్ధ విచారణగల గుణము.

(3) ధర్మము:— అనగా చీమ, దోమ, నల్లి, పేను, మున్నగు బ్రహ్మవరకు గల అనంతకోటి జీవరాసులకు శక్తి వంచనలేక యుపకారము సల్పెడి గుణము. ఇది మూడు విధములుగానున్నది. (1) ద్రవ్యము కలిగియున్న ద్రవ్యరూపేణ. (2) ద్రవ్యము లేనియెడ శరీర కష్టమురూపేణ. (3) శరీరమునందు బలము లేని వారలునయెడ, ధర్మముచేయువారిని జూచి సంతోషించినను ధర్మమే.

(4) దయ:—అనగా ప్రేమగాయుండుట. మన ప్రాణములను మనమేరీతిగా జూచుకొనుచున్నారమో ప్రపంచమందుగల యెల్లప్రాణులను ఆతీరుగనే చూచుగుణము.

(5) శాంతము;— అనగా పగవారు వచ్చిపైబడి గొంతుక గోయుచున్నప్పటికి కోపించక నొకప్రక్కనే కోయుతటి రెండవ ప్రక్కకూడ కోయుడియుటంచు నావకాశము గలుగజేసెడిగుణము.

(6) ఓర్పు:—అనగా కొండంత దుఃఖమువచ్చినప్పటికి కదలని గుణము. వివేకమనగా జ్ఞానము. ఇది యేస్వర్గము.

క్రియా శూన్యంబైన పురంబొండు గలదు. ఈపట్నమందు రేడు నాస్తి, దూతలునూ నాస్తి. ఈపట్నమునందుండు ప్రతివారును యెవరికి వారే స్వతంత్రులయి యుందురు. ఇందొకరి సహాయమున మరియొకరు నడువ బనలేదు. అందఱూ

నొకటిగానే యుందురు. దేదీప్యమానంబగుచుండి స్వతస్సిద్ధంబుగా నిండి నిబిడీకృతంబై యుండును. అఖండితంబైన యీపట్నము యొక్క నివాసుల యనుభవమును హరిహర బ్రహ్మాదులుసైతము వర్ణింపజాలరు. ఈ పట్నమందుండు ప్రతివారును మణులవంటివారు. ఈ పట్నమును మీరిన పట్నము మరియొకటిలేదు. ఈ పట్నమందుండువారేయుత్తములు. ఇదియే లోకాతీతము, అనగా మోక్షము.

## II మాతవృక్షములను గూర్చి.

ఒకయూరిలో ననేకమంది మనుజులుగలరు. వారందరు నైజముగా ఆకలియనునది యొకటి కలిగియున్నారు. ఆ యూరిలో రెండు మామిడిచెట్లుగలవు. అందొకచెట్టుఫలములు విషపూరితములైనవి మరియొకదానిఫలములు మధురరసపూరితములైనవి. విషపూరితములైన పండ్లుగల వృక్షము వెల్లడిగానున్నది. రెండవది మరుగుననున్నది. ఆయూరిలోగల మనుజులు పరంపరా విషపూరితములైన పండ్లను తినినవారెల్లరు తినడమందు యాశగలవారై యభివృద్ధినొందిన కొలది దుఃఖము ననుభవించుచుపాపులగుటకు కారణంబాయెను. ఆరీతిగానే మధురరసపూరితమైన పండ్లుదినినవారుతినడమందు

యాశగలవారై యభివృద్ధినొందిన కొలది సంతోషము కల వారగుచుండిరి. ఈయూరునకు చూపుమేరను మీరిన యిం కొక యూరుకలదు. ఆ యూరునకేగిన ప్రతివారికిని నైజము గానుండు ఆకలి లేకపోవడమనెడి నైజము ప్రాప్తమగును. ఈ యూరునుండి వెడలి ఆయూరుచేరువరకుయీలోగానుండే దారిలో పైన చెప్పంబడిన రెండువిధములైన ఫలవృక్షములలో యేదియును గానంబడదు. కాబట్టి ఆకలిని దీర్చుకొనుటకు యిసుకరేణువంతయాధారమైనను దొరుకునాయన, దొరకదు. ఈప్రయాణమునుచేయ నెవరికైనాసాధ్యమగునాయన, సాధ్య ముకాదు. ఇది కష్టతరంబైన కార్యంబు. కార్యసిద్ధికలిగనేని కలుగులాభంబు నిరుపమానంబు. సాధ్యముకానటువంటి ఈ కార్యమును సాధించ బ్రహ్మాదులకే వశపడదని చెప్పవ చ్చును. ఎవరీకార్యమును జయింతురో వారే బ్రహ్మాదులకు మీరిన వారని నెంచవలెను. నిరాధారంబైన త్రోవ యియ్యది. అనగా అంతులేని యెడారి. దాటువారలే .పురుషలక్షణ ప్రభావులు. ఈవిధముగానే లోకమందు నైజముగానుండెడి తాపత్రయములకు తాళనేరని మనుజులు కొందరు లోకము వెల్లడిగా కనబడడమునుబట్టి లోకవిషయములందు జొచ్చి యావిషయములయొక్క యానందమును యనుభవించుటచే కలిగెడి సంకటమును మరచి, లోకవిషయానందము అతికష్ట ముపడకుండా త్వరగా దొరకడమే మేలనుకొని అందుబడి

అల్లాను వీరలే లోకులు. అనగా అవివేకులు. లోకానుకూలు
రనగా వివేకులు. తమకుగలిగిన నైజపు తాపత్రియములను
ఓర్పునజేసి, అనుకూలము మనకుగానున్నప్పటికి దానినే
గ్రహించి పుణ్యులగుదురు. లోకమునకు లోకానుకూలము
నకు గమ్యమును మీరిన అతీత మొకటిగలదు. ఆయతీతమున
లోకము లోకానుకూలము యీ రెండును లోకమని చెప్పఁ
బడును. ఎట్లన:—ఇనుపసంకెళ్లుగలవాడొకడు, బంగారపు సం
కెళ్లుకలవాడొకడు, ఏసంకెళ్ళులేనివాడొకడు. ఇట్లుగా ముగ్గు
రు మనుజులు గలరు. వారిలో ఏసంకెళ్ళు లేనివానియందు,
బంగారపుసంకెళ్ళు కలవాడుకూడా యినుపసంకెళ్ళు కలవాని
తో చేర్చబడుగాని, అనుభవరహితమైన అతీతంబు, లోకాను
కూలము శుద్ధమైనప్పటికి మలినమైనటువంటి లోకముతో
సమమే యగును. ఏసంకెళ్ళు లేనివాడు సంకెళ్ళువేయబడక
ముందు యినుపసంకెళ్ళు అయితే నేమి, బంగారపు సంకెళ్ళు
అయితేనేమి, యనుటకు యెట్లధికారములేదో అట్లే అతీతము
కర్మబంధముండకముందు శుద్ధమైతేనేమి మలినమైతేనేమి,
యనడమునకు యధికారముగలదు. బంగారు సంకెళ్ళు వేయ
బడినవాడు యినుపసంకెళ్ళు వేయబడినవానికే గొప్పగాని యే
సంకెళ్ళులేనివానికి గొప్పవాడా? కాడనునట్లు శుద్ధమైన యను
భవము మలినానుభవమునకే గొప్పగాని యే యనుభవము
లేనిదానికి గొప్పకాదు. రాత్రియందే దీపముతీతముగాని పగ

లతీతమా? కాదు. ఎవరేని అతీతులగునెడ వారియందు తాపత్రయగుణము శూన్యమగును. లోకమందున్నంతవరకు యేదోయొక వ్యాప్తియుండు. తద్వారా యేదోయొకపనిగల్గు. లోకమందునైజముగానుండు యేవ్యాప్తియైనను అతీతమునకుపోతేగాని రహితముగాదు. కాబట్టి వ్యాప్తిగల ప్రతివాడును వ్యాప్తినిరసనమున హాయిగానుండుటకు అతీతులు గావలె. అతీతమునకు పోవుటకు హరిహరబ్రహ్మాదులును భయమొందుదురనుటకు సందేహములేదు. ఎందుచేత నన లోకమును విడచి అతీతమునకు పొయ్యే వఱకు మధ్య సావకాశమున మనసు యేవ్యాప్తికలదిగా తపించునప్పటికి ఆ వ్యాప్తి తపన చల్లార్చుకొనుటకు లేశమైనను వీలులేదు. మనోవ్యాప్తి ఆదినుండి యేదోయొకపనికలదై స్వప్నమందుకూడా సంచరించుచున్నది. అగుటంబట్టి లోకమును విడిచి అతీతమునకు పొయ్యేలోగా వుండే సావకాశమున యేపనియును లేక యూరకయుండడము యెంతకష్టమో యోచించుడీ? యీరెంటిమధ్యగల సావకాశమున సంభవించుకష్టము యెట్టివారినికూడా తిరస్కరించును. మనసునకు కలుగు వ్యాప్తికి యేపనియును లేక నిరాధారముగానుండ సాధ్యమగునాయన మనంబుతల్లడిల్లదే! లోకాతీతమునకు పోవలెననెడిభ్రమ యెవనికిని గలుగదు. అథవా యెవరైనను గాఢ తెంపునువహించి లోకమువిడిచినను అపారంబైన భీతికలవారై మేరలేని సంకటమున దారితెలియక విచార

వార్ధిని చేరి నోరుకదుప సీలులేక ఆరటమొందును. లోకము ను విడచి బయలువెడలినవారిలో ఒకఅడుగువచ్చి వెనుకకు పోయినవారలు కొందరు, రెండడుగులువచ్చివెనుకకుపోయిన వారలు కొందరు, మూడడుగులువచ్చి వెనుకకుపోయినవార లు మఱికొందరు పెక్కుమాటలేల? అతీతము యింకొక అడుగులో యున్నదనగా అంతు తెలియక తిరిగివచ్చినవారు కూడా గలరు. క్రియకు ఎటయినను లోకమును విడచినతరు వాత అతీతమును చేరేవరకు మధ్యకలిగే దీర్ఘ శ్రమను సహిం చినవాడే బ్రహ్మావిష్ణు మహేశ్వరులకును నతీతుడు. అనగా లోకాతీతుడు. శుద్ధ నిర్గుణ నిరాకార అద్వితీయ పరబ్రహ్మ స్వరూపుడు. పరమహంస.

### 3 దీపమును గూర్చి.

ఇక్కడ మనమొక యిల్లు కలిగియున్నారము. అది యీ గోడమొదలుకొని యాగోడవరకున్నది. దానిలో ననేక వస్తువులుండె. అందుకొన్ని గాన్పించుచుండె, మరికొన్ని గానం బడకుండె. కారణంబేమన అందొక దీపముకలదు. అదికొంత మేర ప్రకాశించుచుండె. మరికొంతమేర ప్రకాశింపకుండె. దీపమెంతవఱకు ప్రకాశించుచుండెనో అంతవరకుగల వస్తు వులు తెలియుచుండె. మిగిలినవి తెలియకుండె. దీపమంతటా ప్రకాశించునెడల గృహమునంగల సర్వమును తెలిసికొనవ చ్చునుగదా!

ఇట్లే ప్రపంచమనునది యొకటికలదు. అదియనేక చిత్ర విచిత్రములు గలదిగానుండె. ఉన్న సర్వంబులో కొంత దెలియబడుచుండె. మరికొంత తెలియబడకుండె. కారణ మే మన యందు దీపమును బోలిన యోచనయనునది యొకటి కలదు. అది యెంతవరకు ప్రకాశించుచుండెనో అంతవరకు తెలియుచుండు. మిగిలినది తెలియకుండు. యోచన నంతటా కలవారమైనయెడసర్వ ప్రపంచమును తెలిసికొనవచ్చును. సర్వమును తెలిసికొనుటకు ప్రశ్న యిదిగానుండ మనవారు పెక్కుగ్రంథములలో జిక్కి ముద్రలనియు, ఆసనములనియు, ఉపవాసములనియు జప, తప, వ్రతములనియు, తీర్థయాత్రలనియు, నిట్లెన్నెన్నో చెప్పెదరు. సర్వమును తెలిసికొనుటకొక యోచనతక్క మరిదేనిచేతను తెలియపడనేరదు.

## 4 పాటును గూర్చి.

శిష్యుడు:— ప్రశ్న:— గురువరా, పురుగులలో పిపీలికాది బ్రహ్మవరకుగల జీవరాసులెల్ల యేనో యొక పాటుకలవిగానున్నవి. కారణంబెయ్యది?

గురు:— ఉ:— శిష్యా, జగతిలోగల అనంతకోటి జీవరాసులు పలు పాటులతోయుచు, ఆనందమను ఫలితమును అనుభవింపజేయునదిగా యుండెను. కాని పాటు రెండువిధములు కలదిగానుండె. ఎందుచేతన పాటువల్లకలుగు ఫలితమున బహు యానందపదవి ద్వయమగుటచే, అందొకటి విషయమున

కలుగునది; రెండవది నిర్విషయమున కలుగునది. అనగా విషయానందము, నిర్విషయానందము. అందు విషయానందము నొసంగు పాటుపలు విధములు గానుండె. ఎందుచేనన విషయంబులు వివరించ నలవిగాని విభాగముల యందుండు టచే, దీనినిబట్టి పాటున్నూ అటు లేయుండును. నిర్విషయము యేకత్వము. దీనినిబట్టి ఫలితము యొక్కటే విధముగా నుండును. గాన పాటును యిటులేయుండును.

గురువరా! ఆనందము రెండు విధములుగా యున్నప్పుడు పొందతగిన దేది? తగనిదేది? రెండును పొందతగినవే నా! శిష్యా. కాదు. విషయానందము విసర్జించవలసినది. నిర్విషయానందము సంపాదింప వలసినది. ఎందుచేనన విషయానందము అనిత్యము. విషయముల కెప్పుడు నిత్యగతి లేదు. నిర్విషయమన్ననో మార్పు లేనిది. సదా యొకటేరీతిగా యుండునది గాన, దీన ప్రకాశించు యానందము నిత్యానందము. ఈ భేదానుబట్టి విషయానందము, విసర్జించవలసినదనుటకు సందేహమే లేదు. బుద్ధిమంతులైనవారు నిర్విషయానందమే యానందమందురు గాని అది కాని దానిని యానందమను టయే లేదు. చక్కెర తిననేర్చినవాడయ్యేటంతవరకు చప్పుడు తినడమనేది దుఃఖముగా తోచనిరీతి నిర్విషయానందమనుభవించేవాడయ్యేటంతవరకు, విషయానందము దుఃఖముగా తోచదు. ఇందుచేతనే అజ్ఞానులు ప్రకృతి ద్వయదో

షంబులను బాయక, పలువిధముల పాటుపడుచు విషయా
నందము కొఱకు ప్రయత్నింతురు.

గురువరా:— ఇది దుఃఖమైన యెడ ఆనందమనెడి
పేరున పిల్చుటకు కారణ మెయ్యది.

శిష్యా:— ఆనందమనెడి పేరు చెల్లుగాని, నాశనంబు
న దుఃఖరూపమగుటచే, దుఃఖమనియే చెప్పబడును. ధనదార
పుత్రాది నాగల ప్రపంచవిషయంబులన్నియు యనిత్యంబులే.
ఉండుటయందు యానందము కనుబరుచు చున్నవి. లేక పోవు
టయందు దుఃఖము నొసంగుచున్నవి. అందుచే క్రియకు
యీ విషయానందము దుఃఖమని పిలువదగును. ఇప్పుడు
జ్ఞానముచే విచారించిచూడ, నిర్విషయానందమే యానంద మ
నుటకు, సందేహమేమియు లేదు. ఎట్టివెట్టివాడైనను సుఖముకొ
ఱకే పాటుపడుగాని దుఃఖముకొఱకు పాటుపడడు. దుఃఖ
రూపమగు విషయానందము కొఱకు పాటుపడువాడు, అజ్ఞాని
యనబడును. అద్వితీయ భాగ్యమున శంకలేని నిర్విషయానం
దము కొఱకు పాటుపడువాడే జ్ఞాని. ప్రాపంచమన విషయ
ముకలది. ముందు సుఖము వెనుక దుఃఖము కలదు. ఈ
సుఖము గడచినపిదప కలుగునది చిరకాల దుఃఖము. ప్రపంచ
మందు ముందు సుఖము వెనుక దుఃఖమున్నదని యెంచ
బడినపుడు, ప్రపంచ విలక్షణో పరతియందు ముందు దుఃఖము
వెనుక సుఖముండును. ఈదుఃఖమున కోర్చిన తరువాత

శేషించినది శాశ్వత సుఖము. మొట్టమొదట వెలుతురునం దుండి పిదప చీకటిలో కేగుట కలిగనేని, యాచీకటి, చీకటి గాక అందు గాఢముగా యున్నట్లుగా గూడ సంభవించును. ఇట్లే ముందు సుఖము, వెనుక దుఃఖము గల ప్రపంచ సుఖము నకు లోబడినవాఁడు సుఖస్థితి గడచిన తరువాత మిగిలిన దుః ఖము దుఃఖముగాయుండుటగాక అందుగాఢముగా యున్నట్లు గూడ సంభవించును. ఇది యిట్లుండ చీకటి యందుండి తరువాత వెల్తురు కేగు వానిస్థితి విచారించి చూతుమేని ఆయా వెల్తురు వెల్తురుగా యుండుట గాక అందు గాఢంబుగాయు న్నట్లు గూడ సంభవించును. ఇట్టిరీతిగానే ముందు దుఃఖము వెనుక సుఖము కలదై యున్న పరమార్థసుఖమునకు యపే క్షించువాఁడు, అంతము గలదియై యున్న దుఃఖ స్థితిని తొలగిన తరువాత మిగిలిన సుఖము సుఖముగాయుండుటగాక, అందు అధిక గాఢముగాగూడ యుండును.



## ౫ మనసును గూర్చి.

మనసువల్ల చెప్పంబడె సర్వ విషయములు కలిగినవై యున్నవి. సర్వవిషయములకు మనసే ముఖ్యకారణము. మన సే సర్వవిషయములను తెలియ జేయుచున్నది. కాబట్టి మనము మనసునే తెలుసు కొనుట ముఖ్యమైనపనియై యున్నది. మన సుయెట్లు తెలియబడును. ఈచెప్పంబడు సర్వవిషయములును

మనసు తెలియ బర్చేదియై యున్నప్పుడు, మనసువల్ల తెలియ బడిన యీసర్వవిషయముల ద్వారా మనసు తెలియబడునా యన తెలియబడనేరదు. చెప్పంబడే సర్వవిషయములలో యే విషయము ద్వారానైనను మనసు తెలియబడ నేరదన్నప్పుడు మనసు తెలియబడేదెట్లు? చెప్పంబడేసర్వ విషయముల ద్వారా మనసు తెలియబడనేరదని తెలుసు కొన్నవారమై చెప్పంబడే సర్వ విషయములు లేనివారమైన యెడ మనసు విషయములను గురించి గుర్తించుటకు విషయము కనబడ నందున అప్పుడు తాను ఒక్కటి తక్క తదితరమేమియు లేనందున మనసు తన్ను దాదెలుసు కొనే పని కలదై యుండును. ఎట్లన మనసు యెప్పుడు యేదో యొకవిషయమును గుర్తించేశక్తి గలదై యుండును. మనసు గురించుటకు విషయ మొక్కటైనా లేక పోవుటచే మనసు తన్ను దాదెలుసుకొనేపని కలదై యుండును. విషయమున్నంతవరకు తన్ను దా గుర్తించు కొనే పని కలదిగా యుండదు. విషయలేమిస్థితి మనసున కెప్పుడు గల్గునో అప్పుడు తన్ను దా తెలుసుకొనే పని గలదిగా నుండును.



## 6. మాయా మనసులను గూర్చి.

అయ్యా తెలియబడే దేమిటి? మాయ. తెలియబర చేదేమిటి? మనసు. తెలియబడేది లేకపోతే, తెలియబఱచే దేలాయుండును? లేనిదిగా యుండును. తెలియబర్చేది లేకపో

తే దెలియబడేదేలాయుండును? లేనిదిగానే యుండును. తెలియబడేది యున్నదనినపుడు తెలియపఱచేది యున్నది. తెలియపఱచేది యున్నదని నప్పుడు తెలియబడేది యున్నది. తెలియబడే దానివలన తెలియపఱచేది, తెలియపఱచేదాని వలన తెలియ బడేది యున్నది. ఇది లేనప్పుడది అదిలేనప్పుడిదియున్నదనుటకు శబ్దమే లేదుగాన, మన మెరుగవలసినదేమనగ మాయను విడిచి మనసు, మనసును విడిచి మాయ, యుండడమునకు సావకాశము లేదు. ఈరెంటిలో యొకటి లేదంటిమేని తోడనే రెండవది కూడా లేకపోవును. ఒకటికలదంటిమేని రెండవది కూడ కలదియగును. ఇందుకు సమ్మతమే మనిన, నేనునీవు యనుకొనడమే సాక్ష్యము. "నేను" అనుకొనుటవలన "నీవు", "నీవు" అనుకొనుటవలన నేను యుండుటగలై; "నీవు" అనడము లేక పోవు నెడ "నేను" అనడము, నేనుఅనడము లేకపోవునెడ "నీవు" అనడము కలదే? లేదు. ఎచ్చట 'మాయ యున్నదో అచ్చట మనసుయున్నది. ఎచ్చట మనసు యున్నదో అచ్చట మాయయున్నది. మాయయెంతగా యేరీతిగా యున్నదో మనసు అంతగా ఆరీతిగానేయున్నది. మనసు యెంతగా యేరీతిగా యున్నదో మాయ అంతగా ఆరీతిగానేయున్నది. మాయ యెంత వరకుండునో మనసు అంతవరకే నుండును. మనసు యెంతవరకుండునో మాయ అంతవరకునుండును. మాయయెప్పుడు లేకపోవునో మనసు నపుడే లేకపోవు

ను. మనసు యెప్పుడు లేకపోవునో మాయ యప్పుడే లేకపోవును. దీపమును విడిచి తేజస్సు తేజస్సును విడిచి దీపముయుండడము సావకాశము లేనిరీతి, బెల్లమును విడిచి తీపి, తీపిని విడిచి బెల్లము లేనిరీతి, ఈదృష్టాంతముల ద్వారా యెవరంతట వారే తెలుసుకొన వచ్చును. వ్యవహారమున "మాయ, మనసు" అని చెప్పంబడును. పారమార్థమున, మాయయే మనసు, మనసే మాయ అని చెప్పంబడును. వ్యవహారమున నొక్కటనుటకు, పారమార్థమున రెండనుటకు వీలు లేదు. కాబట్టి వ్యవహారమున పారమార్థము, పారమార్థమున వ్యవహారము శంకగానుండెగాన, మనమీ రెంటిలో యేపక్షమునకుబోయినను శంకగలవారమగుదుమే కాని అతీతము కాదు. అనగా యెక్కడనైనను శంకగాయున్నది అతీతము కాదనుట అతీతమేగదా. కాబట్టి యేపక్షమున కేగినను అతీతము కాదని యెరుంగవలయును. ఏదతీతమనగా యొకదానికి మరియొకటి శంకగాగనబడు యీ రెండుపక్షములు కానిదియేదో అదియే అతీతము. అదియేదన ఏదో, ఏమో, ఇది, అదియని చెప్పుటకువీలు లేదు. వీలు లేదనుటకు వీలుకలదా! ఇట్లుగా చూడ శబ్దశూన్యముగాన యెవరికివారే తెలుసుకొనవలెను. ఒకరు అనుగుటకు మరియొకరు చెప్పుటకు వీలులేదు.



## 7. మంచియనిపించుకొన యత్నించువారి కష్టమును గూర్చి.

ఈభూలోకమంను నందఱికంటె నెక్కువ, యెక్కువలో నెక్కువ కష్టమొందు వారెవరని ఆరాదీసి విచారించి చూడ జూడ మంచి వారనిపించు కొనువారే. అయితే మంచివారనిపించు కొనుట తప్పా? మంచి వారనిపించు కొనుట తప్పే. అయితే మంచివారు కాగూడదా యేమి? మంచివారేకావలె. ఇందుకు శంకలేదు. మంచివారే కావలెనని యొప్పుకుంటూ, మంచివారనిపించుకొనకూడదా? మంచివారనుట యనునది యేరూపేణ యున్నదందురేని, మంచివారగుట యందు మంచివారే కావలెగాని, మంచి వారని పించుకొనుటయందుమాత్రము మంచివారనిపించుకొన రాదు. అయితే చెడ్డవారనిపించుకొనవలెనా యేమి? చెడ్డవారనిపించుకొనుటకాదు, కాని బహుజాగరూకతతో మంచివారనిపించుకొనుటయందు కనబడకూడదు. కనబడిన వచ్చిన నష్టమేమనిన, మంచివారనినతోడనే చెడువారి చేతిలో జిక్కిన వారగుదురు. కాబట్టియెక్కడ, యెప్పుడు, యెందున, చెడువారనబడెదమోయనెడి భయమందు పూర్ణులగుదురు. చెడువారు చెడువారనిపించుకొనడమందు చెడువారేగాన వారికాస్థితి యందు భిన్నము లేదు. మంచివారు మంచివారనిపించుకొనుటయందు చెడ్డవారనిపించు కొందుమేమోయనెడి భిన్నము కలవా

రై యుందురు. ఇప్పుడు మంచివారనిపించు కొనేవారు భిన్నము కలవారై యున్నారుగాన యీకారణమునుబట్టి మంచివారనిపించు కొనుటకు ప్రయత్నించువారు, మంచివారో చెడువారో యోచించిచూడుడి! మంచియనుట కోడనే చెడు అనునది కలుగక పోయినప్పటికి చెడుఅనుటకు కారణము దానంతటదియే కలిగియున్నది. చెడుఅనుటకోడనే మంచియనక పోయినప్పటికి మంచియనుటకు కారణము దానంతటదియే కలిగియున్నది. ఇప్పుడు మా యభిప్రాయమేమన చెడువారని పించు కొనవలెనని చెప్పుటకాదు. ఇందుకు సమ్మతము పైనే చెప్పంబడియె. మాదగు ముఖ్యాభిప్రాయంబియ్యది. ఏమన మంచివారనిపించు కొనకుండా మంచివారుగ మెలకువతో సంచరించిఅతీత్వరలోమంచినికూడా మీరి చెడుమంచీకాని,మంచిచెడూకాని, అద్వైతు లయ్యెదరేని అతీతు లగుదురు. అందేవంకయును లేదు.ఎంతైననుసమ్మతప్రభావము. ఇందుకుదృష్టాంతర మేమన:—భిక్షాధికారికి వేదన లేదు, లక్షాధి కారికి వేదన లేదు, నడుమ వాడే యిడుమల పాలగును.

---

8- చిమ్మటపురుగును గూర్చి.

---

మహినొకమనుజుడు యొక పెట్టెను గలిగియుండెను. అందొక బట్టయుండె. అందొక చిమటయుండె. వస్త్రము

చెడుటను యెఱిగినవాఁడై బాగుకొఱకు అనేక దేశములు, అడవులు తిరుగచుండె. ఏదేశమునకు పోయి నివసించినా, యేఅడవికి పోయి నివసించినను సీగిపోక పోయె. కారణంబేమన పెట్టియందున్న చిమటను పెట్టెయందేయుంచి యెక్కడికిపోయినా లాభము కలదా? పెట్టెయందున్న చిమటను తీసివేసిన పిదప యెక్కడకయినా పోవలసిన పనియున్నదా ? లేదు. ఇట్టి రీతిగానే పెట్టెయనగా మనసు, బట్టయనగా హాయి, చిమ్మటయనగా సంకల్పము. మనసునందున్న సంకల్పమును మనసునందే యుంచి యెక్కడికిపోయినా యేమిలాభమున్నది. మనసునందున్న సంకల్పమును తీసి పారవైచిన పిదప యెక్కడికైనా పోవలసిన పనియున్నదా? లేదు. హాయినిచెరచు సంకల్పము మనసునందున్నదని తెలియుపరచు యెరుకయే విలక్షణ జ్ఞానము. ఈ విలక్షణజ్ఞానము యెట్లుకలుగుననిన హాయిని జెరచునది యేమిటి యెక్కడనున్నది యనెడి విచారణద్వారా సంభవించవలె. ఈ విచారణయే హాయినినిలుపుట కాధారముగాని వేరొకటి కాదు.

---

## 9. అశుద్ధపుముద్దలను గూర్చి.

---

ఒకచోట ముగ్గురుమనుజులు కలరు. వారి చేతులయందు క్రమేణపెరుగు మూడశుద్ధపుముద్దలుండె. అందు

మొదటివాఁడు తనచేతిలోఁగల సుద్దవల్లకలుగు చెడుగాలికి సహించి పారవేయలేక రోఁగియగుచు బాధ నొందుచుండె. రెండవవాఁడు తన కరమునఁగలముద్ద చెడుగాలినొసంగునదిగా నెఱిగినవాఁడయ్యు సరగున పారవేయలేకపోయె కారణ మేమన, తనకరము పారవేయుటకు తగిన సత్తువలేనిదిగా యుండుటచేత. మూఁడవవాఁడు తనహస్తమునఁగల ముద్ద చెడుగాలి కలదగుట యెఱిగి అసూయపడి తోఁడనే పారవేసి సుఖించెను. ఇట్లుగానె కొందఱు ప్రపంచవిషయవాసన దుఃఖరూపంబైనదని యెఱుగక రక్తిగానెంచి వర్జనకు పాత్రులుగాక చిరకాల బాధకు ఆప్తులగుచుందురు. మఱికొందఱు ప్రకృతి యక్కరమాలినదని చక్కఁగానెఱింగియు గక్కునవిడువకుండిరి. హేతువేమన వారిమనసులు విడదగిన సాహసము లేనివగుటచే. ఇంక కొందఱు జగంబెప్పుడు ఆహ్లాదకరంబున గన్పించక దుఃఖకరముగా యున్నదని యెఱిగి తత్క్షణమే దానిరూపు మాపుచేతురు. హేతువేమన పౌరుష సముద్భూతహర్షంబున నిండి నిబిడీకృతంబుగయుండు మనంబులగుటంబట్టి. మొదటివారు అధమాధములు, రెండవవారు మధ్యస్థులు. మూఁడవవారు ఉత్తమోత్తములు.



## 10. అంతశ్శుద్ధిని గూర్చి.



తెల్లనిగోడమీాద నల్లనిచుక్క యెంత చిన్నదైనను వెల్లడిగా గోచరించును. అట్టిరీతిగానే జాగ్రతగల మనంబున సంశయమెంత చిన్నదైనను, సవిస్తారముగా గమనించును. గోడ మురికిగాయున్నయెడ, చుక్కయెంతపెద్దదయినను గోచరించదు. అట్టిరీతిగానే మనసు అజాగ్రతగా యుండెనేని సంశయమెంత పెద్దదయినను తెలియబడదు.



## 11. చంద్రుని గూర్చి.



చంద్రుడు తనచుట్టు మబ్బుకలిగి యున్నవాడగుటం బట్టి చుక్కగా తెలియవచ్చె. అట్టిరీతిగానే దేవుడు తనచుట్టూ భ్రిమకలిగి యుండుటచేత జీవుడుగా గానంబడుచుండెను. మబ్బు విడినకాలది చంద్రుడనుటకు ముఖ్యంబైన లక్షణంబులు దోచంబడును. ఈతీరుగానే భ్రిమ నివారణంబైన కాలది దేవుండనుటకు తగు సూచనలు గోచరింపబడును. త్రికాలములయందు చంద్రుడు చంద్రుడేగాని చుక్కయనుటతప్పు. అట్టిరీతిగానే త్రికాలములయందు దేవుడు దేవుండేగాని జీవుడనుట అబద్ధము. చంద్రుడు చుక్కనడ మనునది మబ్బుయొక్క ఆరోపితముగాని సత్యముగాదు. అట్టిరీతిగానే దేవుడు

జీవుడనుట భ్రమయొక్క ఆరోపితముగాని వాస్తవముకాదు. మబ్బును తొలగించుటకు గాలి యెట్లవసరమో భ్రమను తొలగించుటకు గాఢవిచారణ కావలసియున్నది.

---

## 12. కుమ్మరపురుగు సామెతను గూర్చి.

-:o:-

లోకమందు వేదాంతులు కుమ్మరపురుగును బురద యంటని రీతి సంసారమందుండి యేమేపని జేసినను మాకు నంటదని చెప్పుదురు. కుమ్మరిపురుగు సామెత సత్యమేకాని వాడుకయందు భేదముగానుండెను. కుమ్మరి పురుగునకు బురద నంటించినను ఎట్లు అంటదో అట్లే వేదాంతులకు సంసారమందు విషయముల గల్పించినను అంటనివారలై యుండవలెనుగదా! ప్రపంచమందన్ని వృత్తులు జేయుచు దుఃఖములను బొందుచు మాకు నంటవని జెప్పెడి వేదాంతులమాట యెంతసత్యమో యోచించిచూడుడీ! వృత్తిరహితమందు పని లేనివారలై యుండవలెనుగాని, పనికలవారలైయున్నంతవరకు, విషయముండును. విషయమున్నంతవరకు, మాయయుండును.

---

## 13. పరిపూర్ణమును గూర్చి.

-:o:-

పరిపూర్ణము రెండువిధములుగా నున్నది. ఎట్లన:- ఖండమని, అఖండమని. ఇచ్చట నొక శంకయున్నది. ఏమన,

పరిపూర్ణమందునూ, అందు ఖండమేమి, అఖండమేమి యనున ది. ఇందుకు సమ్మతము క్రింద వివరముగా తెలియపఱ చెదము:—

తన్నుదా మఱచినది యెఱుక. తన్నుదా నెఱిగినది ఖండపరిపూర్ణము. తన్నుదా నెఱిగి మఱచినది యఖండ పరిపూర్ణము. ఎఱుకగానున్న దేది, ఖండపరిపూర్ణముగా నున్న దేది, అఖండపరిపూర్ణముగా నున్నదేది యనెడిశంక:— ఎఱుకగానున్నది మనసె, ఖండపరిపూర్ణముగ నున్నదియు మనసె, అఖండపరిపూర్ణముగ నున్నదియు మనసె. ఎప్పుడు మనసు యెఱుక, ఎప్పుడు మనసు ఖండపరిపూర్ణము, ఎప్పుడు మనసు అఖండపరిపూర్ణము? తన్నుదా మఱచియున్నప్పుడు యెఱుక, తన్నుదా దెలుసుకొన్నతోడనే ఖండపరిపూర్ణము, తన్నుదా తెలుసుకొని మఱచిన పిదప అఖండ పరిపూర్ణము. ఎఱుకయందు సుఖదుఃఖాదులు గలవు. ఖండపరిపూర్ణమందుకూడా సుఖదుఃఖాదులు కలవుగాని, సమదృష్టి యుండుటచే లేని వే యనబడు. అఖండపరిపూర్ణమందు అసలు అనుభవమే లేదుగాన భాషయే లేదు.

శిష్యః— పరిపూర్ణము రెండువిధములుగా భాగించినరీతి, యెఱుకకూడా రెండు విధములుగా భాగింపబడెను. ఒకటి మలినమందు, రెండవది శుద్ధమందు. మలినపు టెఱుకగాను,

శుద్ధమెరుకగాను. మలినవు టెరుకయనగా కలనైనను తన్ను దానెఱుగనిది. శుద్ధమెరుక అనగా అప్పుడప్పుడు తన్నుదానె ఱిగి యెఱిగినరీతి నడవక హఠాత్తుగా మరచిపోవునది. ఖండ పరిపూర్ణమనగా, తన్నుదానెఱిగి యెఱిగినరీతి మరవకనడుచు నది. ఈ ఖండపరిపూర్ణమే శుద్ధములో శుద్ధమనబడును. అఖండపరిపూర్ణమనగా:— (1) తన్నుదా నెఱుగకుండుట, (2) ఎఱిగి యెఱిగినరీతి నడవకమరచుట, (3) ఎఱిగి యెఱిగిన రీతిగా మరువక నడచుట, ఇవి మూడును చల్లారిపోయినది. ఏమియు లేనిది, ఏమియును కానిది. ఇచ్చట శంక యొకటి కలదు. ఏమన:— మనసు మలినవు టెరుకగాను, శుద్ధమెరుకగాను, ఖండ పరిపూర్ణముగాను, అఖండపరిపూర్ణముగాను, యున్నదిగా యున్నదని చెప్పినాము. ఒకటియే యిన్నివిధములుగా యెట్లు న్నది యనునది. ఇందుకు సమ్మతమేమనిన:—

ఒకలాంతరు కలదు. అది నాలుగు రంగులుగల యద్దములు కలదాయె. అందొకటి యెఱ్ఱనిది, రెండవది నల్లనిది, మూడవది పచ్చనిది, నాల్గవది వూదాది. అందొక దీపముండె. అదినాలుగువిధములుగా ప్రకాశించుచుండె. దీపములు నాలుగాయెనా? కావు. ఒక్కటే నాలుగు విధములుగా గనబడుచుండె. కారణమేమన, దీపముపొందియున్న అద్దములయొక్క రంగులు భేదముగా యుండుటంబట్టి. రంగుల భేదమునుబట్టి దీపమునకు భేదపు పిలుపు గలిగినట్లు, మనసు

పొందియున్న అనుభవము భేదముగా యుండుటంబట్టి మన సుసకు భేదనామములు కలిగెగాని, అసలు వస్తువ ఒక్కటే అయి యున్న దనుటకు సందియము లేదు.

శిష్యః—— మొ త్తమువిూద; యెరుకని, ఖండ పరిపూర్ణమని, అఖండ పరిపూర్ణమని, మూడు విధములుగాచెప్పకొన్న జాలు. ఎరుక కట్టెవంటిది. ఖండపరిపూర్ణము నిప్పవంటిది. అఖండ పరిపూర్ణము బూడిదెవంటిది. కట్టెయందు కాల్పబడే గుణ మెట్లున్నదో, యెరుకయందు ఖండింపబడే గుణము యట్లే యున్నది. నిప్పయందు కాల్చెడి గుణమెట్లున్నదో, ఖండ పరిపూర్ణమందు ఖండించెడిగుణము నట్లేయున్నది. బూడిదె యందు కాల్పబడెడిగుణము, కాల్చెడిగుణము, యీాద్వయ ము యెట్లులేదో, అఖండపరిపూర్ణమునందు ఖండించెడి గుణ ము, ఖండింపబడెడి గుణము, ఈ రెండు అట్లేలేవు. ఎరుక గలవాడు తన్ను ఆనందింపచేసికొనుటకు స్వతంత్రాధారము కలవాడుగాని, యితరాధారము కలవాడుకాని కాడు. (యీా యిద్దరిలో యెవడుకాని వానివంటివాడు) ఖండ పరిపూర్ణుడు యితరాధారము కలవాని వంటివాడు. అఖండ పరిపూర్ణుడు స్వతంత్రాధారము కలవానివంటివాడు:—— ఎరుకకలవాడు, అత్తచే పోరుపడెడి కోడలువంటివాడు. ఖండ పరిపూర్ణుడు అత్తసమ్మతముగల కోడలు వంటివాడు. అఖండపరిపూర్ణు డు అత్తవంటివాడు.

శిష్యు:— పరిపూర్ణమనడమందు, పరిపూర్ణమంటూ, ఖండమేమి, యఖండమేమి యనెడి శంక కలదని, అందుకు సమాధానము దిగువ చెప్పెదమని చెప్పినారము. అందుకుసమ్మతము యిచట చెప్పంబడు; యేమన:— ఏయాధారములేని మనుజునకంటె, యేతీరునైన యితరాధారము గలవాడతీతుడేగదా; సందేహము కలదాయన, లేదు. ఏదోయొక యితరాధారముకలవాని కంటె స్వతంత్రాధారము కలవాడే అతీతుడు. అతీతులనడమందు యిద్దఱు సమానముగానే యున్నారుగాని, యితరాధారము స్వతంత్రాధారమనడమందు భేదముగా యుండె. అట్లనుటంబట్టియొకడు పూర్ణమందుఖండము కలవాడని, రెండవవాడు అఖండుడని చెప్పుటకు హేతువాయె. అత్తచేపోరుబడెడు కోడలుకంటెను, అత్తసమ్మతముగల కోడలతీతురాలే. అయినను, అత్తయే యనడమందు అతీతము అఖండముగా యుండునట్లు గ్రహించవలెను. అట్లుగానే యెరుకను అతీతము ఖండపరిపూర్ణము. ఖండ పరిపూర్ణమున కతీతము అఖండ పరిపూర్ణము. యొకయూరిలో నొకనవుకరి కలడు. వానిపైన నొకప్రభువుండె. అలవానిపైన మరియొక ప్రభువుండె. ప్రభువు యనడమందు, చివరయిద్దఱున్నా సమముగానేయున్నారు. అయినను ప్రభుత్వమందు ఖండాఖండమున్నట్లు చూడుము.

శిష్యు:—కట్టెను కట్టెతో రాచగా నిప్పాయె. నిప్పయినతో

డనే కట్టెయొక్క నామరూప క్రియలు శూన్యమాయె. పిదప కట్టెయొక్క నామరూపక్రియలు శూన్యపరచిన నిప్పు తానంతటదియె చల్లారె. అట్టిరీతిగానే యెరుక యెరుక తర్చుగాతర్చుగా ఖండ పరిపూర్ణమాయె. ఖండపరిపూర్ణ మయినతోడనే యెరుకయొక్క నామరూప క్రియలుశూన్యమాయె. పిదప యెరుకయొక్కనామరూప క్రియలు శూన్యపరచిన ఖండపరిపూర్ణము దానంతటదియె చల్లారె. నిప్పుచల్లారిన పిదప శేషించినది బూడిదెయయినట్లుగా, ఖండపరిపూర్ణము చల్లారిన పిదప శేషించినది అఖండపరిపూర్ణమాయె. కట్టెనశించుటకు నిప్పు కావలసిన రీతిగా నిప్పునశించుటకు యేమయినా కావలసివచ్చెనా? లేదు. అట్టిరీతిగానే ఎరుక నశించుటకు ఖండపరిపూర్ణము కావలయుగాని, ఖండపరిపూర్ణము నశించుటకు కావలసినది లేనేలేదు. కట్టెనశించేవరకు నిప్పు యెట్లు పనిగలదై యుండునో, యెరుకనశించేవరకు ఖండపరిపూర్ణము అట్లేపనిగలదయి యుండును. కట్టెనశించిన పిదప నిప్పుపనిలేనిదై చల్లారినరీతి యెరుక నశించిన పిదప ఖండపరిపూర్ణముపనిలేనిదై చల్లారును.



## 14. ఆశాసామర్థ్యతను గూర్చి.

—:0:—

ఆశచే లోకాలోకంబులను మునిగింపవచ్చు. సూర్య చంద్రాదులను స్థానంబులనుండి దప్పింపవచ్చు. భూమి యాకాశంబులను తల్లడిల్లునట్లు గావింపవచ్చు. మహి పర కాయ ప్రవేశ విద్యలను జూపవచ్చు. నీరు, నిప్పు,ముండ్లపై నిండుమక్కువతో బరుండియుండవచ్చు. నేనుసమాధి కేగు చున్నాడనటంచు చక్కగా వక్కాణించి చెప్పవచ్చు. భం గరహిత సత్సంగంబు నొసంగెడి యంగీ లనేకంబులను ధరిం పవచ్చు. ఆకాశ గమనంబుసేయ వచ్చు. అదృశ్యమై మఱియొ కచోటగాన్పించవచ్చు. కోట్లకొలది ధనమునుకుప్పలుబోసిచూ పవచ్చు. కనకపుకొండలైనగా గావింపవచ్చు; పుట్లకొలదిబి య్యపన్నమును దినవచ్చు. బుడ్లకొలదిసారాయినిత్రాగవచ్చు. వేలకొలది వత్సరంబులు జీవించియుండవచ్చు. తల్లకిందులుగా తపసులనుజేయవచ్చు. సముద్రము ఉప్పొంగురీతి మహాకవి యైయుండవచ్చు. అన్నపానీయంబులను గ్రిన్ననమానవచ్చు. హేమాద్రినెత్తిహస్తంబున నాడింపవచ్చు. సప్తకోటి మహా మంత్రాది యోగంబులనన్నింటిని సాధింపవచ్చు. అకటా ఆశ చేయునివియన్నియు జేయవచ్చునుగాని, ఆశయనెడిరెండక్షరము లఅర్థంబెఱింగి అల యాఆశనుగోసి అహారహిత అద్వితీయ పర బ్రహ్మస్వరూపమును గాంచ గల్గుట కష్టసాధ్యము.

## 15. మనోస్థితినిగూర్చి.

:o:

నిర్వికల్పసమాధి నిష్ఠాగరిష్ఠులనంబరగి, చలియొండవానలకోర్చి, నిద్రాహారంబులనువిడిచి, యడవులకుంబోయి యనేక వేలవత్సరంబులు తపసులం జేసి, మహాఋషీశ్వరులటంచు వక్కాణింపబడిన వారలే చెదిరనడివార్త నాలించ నాదుమనంబున సంశయముదోచుచుండె. అదియేమన, సర్వవికారసంగమమైన సంసారబంధమునజిక్కు మనుజులెట్లు దేహ, శాస్త్ర కులాభిమానంబులనువీడి, పదియూరవవన్నె మేలిమిబంగారంబునువ్రోలు స్థలనరహితంబగుున మనంబును వశపరచుకొని శాశ్వతసుఖానందసముద్రమున తాండవమాడగలరా యనెడుభీతి విస్తరిల్లుచున్నదే! హా! తీవ్రజ్ఞానానందవిలాసినీ! తన్మయానందస్వరూపిణీ! అంబా!

---

## 16. ఆత్మజ్ఞాన మార్గప్రశంసను గూర్చి.

:o:

శిష్యుడు.— ప్ర.—గురువరా పరమార్థమునకు శ్రోవయెయ్యది?

గురువు.— ఉ.—శిష్యా లేక పోవలె.

శి.— ప్ర.—అయ్యా! యేమి లేకపోవలె?

గు.— ఉ.—వత్సా! నాదిగా యున్న సర్వము.

శి.— ప్ర.— దేవా! యెట్లు లేకపోవును ?

గు.— ఉ.—బాలకా! నేనుగాక నేనుగాయున్న నేను లేని
యెడ,

(పరమాత్మ యగునేనుగాక జీవాత్మగాయున్న నేనులేనియెడ)

శి.— ప్ర.—స్వామీ! నేనుగాక నేనుగాయున్న నేను యెట్లు
లేకపోదును?

గు.—ఉ.—శిష్యా! పరమార్థమును గోరు యెరుక సంభవ
మైనయెడ.

శి.— ప్ర.—గురువరా! అదియెట్లుసంభవమగును?

గు.— ఉ.—శిష్యా! ఇట్లని చెప్పుటకు కారణము మిధ్య.





# శ్రీరంగావధూతలవారి

## జ్ఞానమార్గపద్యములు.



క. దేవాది దేవసద్గురు
భావాతీతాత్మలోల • బహుళవిశాలా
కేవల నిర్గుణధామా
త్రోవేదియు నెరుగకుంటి • బ్రోవుము తండ్రీ 1

క. ఏదరి జేరువొ నే యమ
బాధకు నెట్లోర్తు నీదు • వరకృపసుమహాత్మా
కాదన నెద్దియు సేయను
సాధులనను జేర్చుమయ్యా • సద్గురునాథా. 2

క. ఇచ్ఛలు దీరక భువిలో
మచ్చరమున జేరి వట్టి • మమతలతోడన్
పిచ్చికి లోబడు చుంటిని
నిచ్చయమెరుగంగ లేక • నిజగురువర్యా. 3

క. దొమ్మరియాటగ నుండెను
బొమ్మలచోద్యమును జూడ • పుడమీస్థలిలో
నమ్మితి మిము నా మనమున
సమ్మతి నను బ్రోవు మార్య • సద్గురుదేవా. 4

క. రాగద్వేషముచేతను
బాగుగ మిము గొల్వలేక • భ్రష్టుడనైతిఁ
వేగమెనను దరి జేర్పుము
శ్రీ గురువరు నిష్కళంక • శ్రీకర దేవా. 5

క. ఉండను దేహము భువిలో
దండుగ మోహాదులెల్ల • ధైర్యముతోడఁ
మెండుగ గల్గుచు నుండెను
చెందెడి మార్గంబు జూపు • శ్రీగురువర్యా. 6

ఆ. కలనుదోచు సర్వ • చలనంబు మేల్కొన్న
పిదప గలది యగునె • వెదుక భ్రాంతి
తీరెనేని జగము • నారీతిలేదయా
సంగ రహిత విమల • రంగదాస. 7

ఆ. కొద్ది గొప్ప మిథ్య • గురుపర బ్రహ్మంబు
శుద్ధనిర్గుణాత్మ • సిద్ధులెరిగి
బంధములను బాసి • వర్తింతు రిలలోన
సంగ రహిత విమల • రంగదాస. 8

ఆ. నోరుదెరచి పలుక • దారిలేదు భువిని
ఊరకున్న వాడె • ధీరుడౌర
తారుమారులేసి • బేరగాడవు నీవె
సంగ రహిత విమల • రంగదాస. 9

ఆ. పుట్టుటకును ముందు • పుట్టినిట్టు వెనుక
యెట్టి స్థితిగల దల • గుట్టు మరచి
నట్టనడుమ జనులు • మిట్టిపడగ నేల
సంగరహిత విమల • రంగదాస. 10

ఆ. అనిశ మొక్క రీతి • మనసు నిల్పెడి వారి
లెందునభువిదుఃఖ • మొందబోరు
మగడు లేనియాట • తగిన దై యుండెరా
సంగరహిత విమల • రంగదాస. 11

ఆ. పరుల దోష మెన్న • తెరవు గన్పడుబిన్న
నెవరితప్పు వార • లెరుగరన్న
రోగమిదియె జగము • బాగు గాకుంటకు
సంగరహితవిమల • రంగదాస. 12

ఆ. కల్ల నిజము రెండు • కల్లయేజూడంగ
కల్ల నిజము లేవి • కానరావు
తల్లి తండ్రి లేరు • పిల్లలెటులవచ్చె
సంగరహిత విమల • రంగదాస. 13

ఆ. చీకటియును వెల్గు ♦ నేకమైనపిదప
లోకమేదికూడ ♦ లేకపోవ
వృల్ల సీదలేమి ♦ యూహించిజూడరా
సంగరహిత విమల ♦ రంగదాస. 14

ఆ. జగము మిథ్యయనుచు ♦ తగ జెప్పగానకుండ్రు
జగము మిథ్యయనుచు ♦ నిగుడ నేల
జగము మిథ్యయైన ♦ నరగునవిడరాద
సంగరహిత విమల ♦ రంగదాస. 15

ఆ. అన్ని దిశలయందు ♦ నున్నదిపూర్ణంబు
సున్నగాదెయితర ♦ మెన్నిజూడ
తన్ను దానుగన్న ♦ తానె లేకనుపోవు
సంగరహిత విమల ♦ రంగదాస. 16

ఆ. రెంటికి సమమనొక ♦ టొంటరిగానుండె
రెంటి నొకటిజేయు ♦ కుంటివేని
ఒంటి దొంటినుండ ♦ తంటాలు వచ్చురా
సంగరహిత విమల ♦ రంగదాస. 17

ఆ. పాహికానదొడ్డి ♦ పగటితక్షైతనువు
వేరు కాలమందు ♦ వెతలుసాక్షి
సతత మేకరీతి ♦ సమబుద్ధియొక్క
పూర్ణమాయె పుణ్య ♦ పురుషవినుము. 18

ఆ. అందహీనము జగ • మందలి విభవము
హెచ్చటంచు నమ్మ • పిచ్చిమమత
నిశ్చయాత్మ నెరిగి • నిలకడ గనినెడ
ముక్తికాంత గూడి • మురియవచ్చు. 19

ఆ. మనసు నోరులకిచ్చి • మాట్లాడ యుక్తంబె
అనిశమౌనముద్ర • ననుసరించి
శమ సహితముౖన • విమలశూరత్వంబు
వెలయచేయు భువిని • కలనుముక్తి. 20

ఆ. లేతి చింతకాయ • జూతుమెనిధరణి
నంతయును నొకటిగ • నమరియుండు
పండిన పిదప మది • పరిశోధ నెరిగిన
దేని కదియెయుండు • దెలియుడయ్య. 21

ఆ. రాత్రికాలమందు • నాత్రంబున నిశికి
దీప మొక్కదాని • జూపినారు
పగలు వచ్చుపిదప • నగిణితో నందంబు
రాత్రివేళదీపి • రాదుసుండి. 22

ఆ. ఎన్ని పాడివిన్న • నేమిలాభము కద్దు
అన్నలార వినుడి • యవనిలోన
తన్ను దాగనవలె • తనువు మరచినెడల
నున్న గా కనుజగ • మున్నదగున. 23

ఆ. కంపువాలమీద ♦ కందువాలను వేసి
దండిగ ధరపొట్ట ♦ నిండజాల
కూడు తినియుదొడ్డి ♦ పాపు జేయుచెగాసి
వేదు కేమిలేదు ♦ వెఱ్ఱితండ్రి. 24

ఆ. వఱ్ఱగా దినుచును ♦ వగలుజెందుచుగొప్ప
బొఱ్ఱ పెంచుకొంచు ♦ భోగమలర
విఱ్ఱవీగుచుంట ♦ వెఱ్ఱిమోహముకాని
కఱ్ఱ లందుబెట్ట ♦ కాల్తురంధప. 25

ఆ. ధనసతియును సుతుల ♦ ధరశ్రీకాంక్షలువీడి
పనిగొనియును జూడ ♦ పరమపదవి
నరయ చేతియందు ♦ నాటలాడుచునుండు
నకట యనుభవించు ♦ నఘు డెరుగు. 26

ఆ. భావమునకు మీది ♦ కేవల నిర్గుణం
దాసకావ లేమి ♦ దగులబోదు
ధవరులకు వశము ♦ తెలియుగానీయది
నీవు గనుమదీని ♦ నిర్మలాత్మ. 27

తే.గీ. అమితవిశ్రాంతి పరమునం ♦ దమరియుండు
సుమతిగాకున్న సుజ్ఞాన ♦ సూటిలేదు
దమతమాది విషయముల ♦ దగులకెపుడు
అమల రంగావధూతయో ♦ విమలమిత్ర. 28

క. విత్తే చెట్టుకు మూలము
విత్తునసే చెట్టుగలదు ♦ వివరింపంగా
విత్తును చెట్టును గానిది
యుత్తది బయలుంచు తావు ♦ యుర్విని గనరా. 29

క. ధనమును జూచుక ధరణిని
ఘనమని యుబ్బేటి వారి ♦ గతులను మనమే
కనులార జూచు చుంటిమి
చనిపోయెడు వేళ వెంట ♦ జనదది యధిపా. 30

క. వినవలె కనవలె గొనవలె
తినవలె పరిపూర్ణమందు ♦ ధీరతగుణముగ్
విని కని గొని తినకున్నను
అనయంబును సౌఖ్యదుఃఖ ♦ మగునే మనసా. 31

సీ॥ కలనైన వలదంచు ♦ కలిమాయసంగంబు
పలుమారు మదిలెన్న ♦ పలుకుమార్య
తలలేసి చలనంబు ♦ గల్ల భ్రాంతివిడ నాడు
మిలమీదసిఖిలంబు ♦ కలవరంబు
అలనాడు బుధులెల్ల ♦ మలమూత్రముల కొంప
వెలి జేసి కులగోత్ర ♦ ములను బాసి
వెలలేనినిర్మలా ♦ చలభావమున జేరి
బలువైన విశ్రాంతి ♦ బడయుచుండ్రి

తే॥ తెలివి లేనెడ గననేగ • మలఘుమనము
పలువ్రు రెరుగుటకును సాధ్య • పదవిగాదు
వలలితంబుగ విలసిల్లు • సౌఖ్యగతిని
తెలసిపొందుమా వేవేగ • ధీరతాత్మ. 32

క ం దా ర్ధ ము లు .

1. కొందరు గురువులు ప్రకృతిని। యుందని భ్రిమనరులు మోసమొందెదరనుచుఁ।అందంబలరగ నితరుల। సందేహము బాపురీతి। యుందురో మనసా• వారలె వ్యసనమొందుదు రేమనసా• సందులేనత్యాస। నొందుచును నిత్య। మొందుఝూచిన భవబంధము విడువక। యుందురో మనసా• వారలె వ్యసన మొందుదు రే మనసా॥

2. ఊరక వారీరలు మహి। సేరరు వేదాంతులనెడి పేరొందుటకై। ధీరులు దెల్పిననీతిగ। చోరులు బల్కెదరు వేషధారులే మనసా • అద్భుత డంబాచారులే మనసా • దారిదెలియక బహు। క్రూరకృత్యములు। చేరిసల్పెదరు విస్తారమైనకలుష। ధారులే మనసా • అద్భుతడంబాచారులే మనసా॥

3. పరనిందాత్మస్తుతియును। మరువక జపియించు కపటగురువులబోధల్। తెరవని నమ్మిన భృత్యులు। దరిజేరరుచెడుట సత్య। మెరుగవె మనసా • కలనయినను సరిగానోమనసా •

తిరుగ జన్మము లేని । మరుగుజూపెదను నీ । తరుగని దుర్గ
తిపెరుగ జేతువు వ్యర్థ । మెరుగ వేమన సా • కల్ల నైనను సరిగా
నోమనసా॥

4. ఇప్పటి గురువుల శకునము । నొప్పుగ భావించు మను
జు లెప్పటి కైనన్ । తప్పక చెడెద రెశన్నను । త్రుప్పునునది క్రిం
గురీతి మెప్పుగాదో మనసా • ప్రియులను వెదకి చెప్పవే మన
సా • విప్పిజూపరు మూకు । గుప్పెడలో ద్రవ్య । కుప్పగలదని
యేరుఅప్పుదీర్చ లేరు । మెప్పుగాదో మనసా • ప్రియులను వెద
కి చెప్ప వేమనసా॥

5. అచ్చునునది చౌకాయెను । బిచ్చపు గంధంబు లెల్ల జొచ్చె
నుభువిలో । చచ్చుకు గురువరులందుకు । ముచ్చటగాదగిన
వారె హెచ్చిరోమనసా • ఛీ,ఛీ, మోసపుచ్చునో మనసా •
మచ్చిక లేనట్టి । రచ్చను చేపట్టి । మెచ్చులుకోరేరువిచ్చలవి
డివారు । హెచ్చినోమనసా•ఛీ,ఛీ, మోసపుచ్చునో మనసా॥

6. అస్థిరమందురు జగమున । ప్రస్తుతగురువరులుజాల జాస్తి
గభువిలో । అస్థిరమస్థిరమని నెడ । సుస్థిర జ్ఞానంబుగలదె నాస్తి
ఫ్రోమనసా•అచటచట వెదకిరో స్తినోమనసా•రాస్తానెరిగిన
వారు । మూస్తారు తమనోరు నాస్తనముగుతీరు చూస్తి మిత
రపోరు । నాస్తిప్రోమనసా•అచటచట వెదకిరో స్తినోమన
సా॥

7. ఓటిదనెరి కుండియు నది। చేటగుసంసారమందు కూట
మింకోడన్।తీరుగాదల జేసుకో నెదరు।కాటిని బ్రతిమాలుకొరకు
బోటులో మనసా•అట్లనదగు మున్నాటికో మనసా•అటుగనా
లేడు।కూటిలోబడియుండగ। కాటు నొందినపిదపమాటాడకే
ద్భును। బోటులో మనసా।అట్లనదగు మున్నాటికో మనసా॥

8. పిల్లులు గ్రుడ్డివి యగుటచె। కొల్లలుగనుతిరుము యెలుకపిల్ల
లుగూడన్। చిల్లరవృత్తులుసహితము। అల్లరి చేయుటకుసాగు
మెల్లగమనసా •పలువిధములకల్లరిమనసా• యుల్లము భ్రాం
తియై। దొర్లుచునుండుట। మళ్లిజన్మమునకు వెళ్లిరానడ
మాను। మెల్లగమనసా। పలువిధముల కల్లరిమనసా॥

9. పాపము పుణ్యంబనెదరు। పాపము పుణ్యంబుద్వయము
పాపంబనుచున్।పాపంబెరుగరు పుడమిని।పాపముహరియిం
చుటెట్లు పాపమోమనసా • పాపము జడస్వరూపమో
మనసా•వీవున గలదాని। మాపుజేయబూని।తాపము నొం
దేరు పాపాత్ములందరు। పాపమోమనసా • పాపముజడస్వ
రూపమో మనసా॥

10. ఆశను గోసినమనుజుడు। బాసినవాడగును దుఃఖపాశము
లెల్లన్। మోసము జెందునె విషయ ప్రకాశుండై యుండ
డెచట వాసిగమనసా• యతడెపరదేశికుడో మనసా • లేశ
మైనజడవి।లాసములంటునే। నాశనమగు సౌఖ్య వాస
నహారణము। వాసిగ మనసా • అతడెపరదేశికుడో మనసా॥

# ప్రకటన.

---

| | రు. అ. పై. |
|---|---|
| ♦ కాళీప్రసాదిని (శ్రీ జ్ఞానమాంబగారి పతకములో) | 0—1—0 |
| ♦ విజ్ఞానామృతము:— భక్తిజ్ఞానవైరాగ్యములను బోధించునది | 0—1—0 |
| ♦ శ్రీరంగావధూతలవారి దివ్య జీవితము, జ్ఞానబోధ (మోక్ష దాయకము) | 0—4—0 |
| శ్రీరంగావధూతలవారి జ్ఞానబోధావళి.— (శ్రీరంగావధూతల వారిచే చెప్పబడిన నీతిబోధకములగు కీర్తనలు, పద్యములు, వచనము.) | 0—4—0 |
| జ్ఞానోదయశ్రేణి.— ఇది అన్ని సంవత్సరములకు సుపయుక్తమై మహాత్ముల జ్ఞానవాక్యపూరితమై మోక్షదాయకమగు శ్రేణి. | 0—6—0 |
| పరసాధని పత్రము.— | 0—0—6 |
| కుమార సుగుణబోధిని — బాలురకు హితోపదేశము (ఇదియొక సతీమణిచే వ్రాయబడినది) | 0—1—0 |
| జ్ఞానామృతము. | 0—0—6 |

వలయువారు.— ఆత్మూరి రామమోహనరావు, గుంటూరు లేక ఆత్మూరి జగన్మోహనరావు, బందరు, అని వారికి తెల్పించుకొనవలయును.

---

ఈమార్చు చేయబడిన పుస్తకములు శ్రీ జ్ఞానమాంబగారిచే రచియింపబడెను.

| | |
|---|---|
| స్త్రీ బాలవైద్యసుధాబ్ధి. | 1—8—0 |
| శోఫ (సంజు) రోగనివారిణి. | 0—4—0 |

